# యువ నుంచి యువ దాకా

కవితా సంకలనం 1936-96

ఎంపిక, కూర్పు

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ



అ.జో - వి.భొ ప్రచురణలు

1999

**యువనుంచి యువదాకా** కవితా సంకలనం

YUVA NUNCHI YUVADĀKA

AN ANTHOLOGY OF MODERN TELUGU POETRY

ఎంపిక, కూర్పు : ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

EDITOR : *INDRAGANTI SRIKANTHA SHARMA*

ప్రతులు : 1000

వెల : రూ.120/-

ప్రచురణ : 1999

ముఖచిత్రం : 'శ్వేత'

**ప్రతులకు :**

1. డా. జి.బి. రామకృష్ణశాస్త్రి
   401, శ్రీనివాస అపార్టుమెంట్స్
   866, స్ట్రీట్ నెం. 6,
   హుమాయూన్ నగర్, హైదరాబాద్ - 500 028

2. కల్పనా రెంటాల
   12-11-428, స్ట్రీట్ నెం. 3,
   వారాసిగూడ, సికిందరాబాద్ - 500 061

3. విశాలాంధ్ర పబ్లికేషన్స్, అన్ని శాఖల్లోనూ.
4. దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
6. నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్.

**ముద్రణ:**

**విష్ణ ప్రింటర్స్ ప్రై॥ లిమిటెడ్**
**వల్లకుంట, హైదరాబాద్-44.**
**ఫోన్ : 7636242**

**అ.జో - వి.భొ. ప్రచురణలు**

# క్రమం...

# కవిత్వమొక తీరని దాహం

కవి అంటే లోకంలో అందరికీ ఆకర్షణ. సమాజ జీవన సంద్రాన్ని మథించి ఇది విషమూ ఇది అమృతమూ అని చూపుతాడని. సమాజ హితం కోసం ఎన్నో ఆశలు రేపుతాడని! ఆలోచనామృతం కదా సాహిత్యం!

శరీరంలో ఎక్కడ ఏ చిన్న నొప్పి తగిలినా, బొప్పి తగిలినా చెమర్చేది కన్నే. సమాజ శరీరానికి కవికూడా అటువంటివాడే. ఏడ్చినా నవ్వినా కన్నీరే ఉబకడంలో పరమార్థం ఇదే. స్పందించే హృదయం కవిది. ప్రకృతినీ మానవ ప్రకృతినీ నవనవోన్మేష ప్రతిభాశాలితతో అర్థం చేసుకుంటాడు కవి. అధ్యయనం చేస్తాడు కవి. అందుకే సమాజానికి అంతగా ఆదరణీయుడు ఆకర్షణీయుడూ అవుతున్నాడు.

'యువనుంచి యువదాకా' అనే ఈ కవితా సంకలనంలో ఆధునిక కవితా ఖండికలున్నాయి. ఈ అరవైఏళ్ళ తెలుగు కవిత ప్రాతినిధ్యం ఈ సంకలనంలో నిరూపితమైంది. స్వరూపితమైంది. అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్‌వారు అ.జో వి.భొ. ప్రచురణలను ప్రారంభించింది తెలుగువారిలో ఉత్తమ సాహిత్యాభిరుచిని పునరుజ్జీవింప చేయాలనే ఉద్దేశంతోనే. నాలుగు కాలాలపాటు నిలిచేవీ, అందరూ తలచేవీ అయిన పుస్తకాలు తెలుగువారికివ్వాలనే సత్సంకల్పంతోనే. పుస్తకాలు చదవడం అనే అభిరుచి తగ్గిపోతున్న ఈ రోజుల్లో ఇటువంటి ప్రయత్నానికి పూనుకోవడం సాహసమే కావచ్చు. అయినా, ఎవరో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు ఒక మంచి పనిని ప్రారంభించాలి కదా! ''పూని ఏదైనాను ఒక మేల్ కూర్చి జనులకు చూపవోయ్.'' అన్నట్లు -

అ.జో వి.భొ ప్రచురణల శ్రీకారంగా తిరుమల రామచంద్ర స్వీయచరిత్రాత్మక రచన 'హంపీనుంచి హరప్పాదాకా' వెలువడింది. ఏడాది తిరగకుండానే ఈ గొప్ప పుస్తకం పునర్ముద్రణ కోరుతున్నది. కాబట్టి మంచి పుస్తకానికి ఆదరణ ఏదో ఒక విధంగా కొనసాగుతూనే ఉంటుంది. అ.జో వి.భొ ప్రచురణలకు ఒక విశిష్టత, ఒక విలక్షణత, ఒక వినూత్నత సంతరించాలని ఆశయం. శ్రీరామచంద్రగారి ఆత్మీయకథతో అది సిద్ధించింది. అటువంటిదే ఇప్పుడు వెలువరిస్తున్న ఈ కవితా సంకలనంకూడాను అని ఆధునిక కవితాభిమానులు అనగలరనీ, విరివిగా కొనగలరనీ ఆశిస్తున్నాము. సంవత్సరానికి ఇటువంటి చెప్పుకోదగిన గొప్ప గ్రంథాలు రెండు మూడైనా తేవాలనే అభిలాష నెరవేరాలంటే తెలుగువారి అభిమానమూ సహకారమూ అవసరం కదా!

కవిత్వం ఏనాడూ సశేష నిర్వచనీయం. కవిత్వమొక తీరని దాహం - అది 'అక్షర' లోకంతో కవి సాధించిన 'సోహం' అంటూ మీరూ ఈ అనిర్వచనీయ వచనీయతను ఆస్వాదించండి అని ఆహ్వానించే -

హైదరాబాద్
6-12-98

అ.జో వి.భొ. ప్రచురణల పక్షాన
**అక్కిరాజు రమాపతిరావు**

# ఎందుకీ ఆధునిక కవిత్వం?

ప్రశ్న వున్నంత సులువుగా జవాబు దేనికీ వుండదు. పైగా చెప్పేవాడికి తర్కప్రజ్ఞ ఉండాలే గాని, ఒకే ప్రశ్నకి నాలుగైదు విధాల జవాబులు కూడా చెప్పవచ్చు.

కవిత్వం సంగతీ అంతే. ఆ కాలం, యీ కాలం అని కాదు, ఎప్పుడైనా సరే కవిత్వానికి నిర్వచనాలు పుట్టినంత పుష్కలంగా మన తెలుగులో పఠిత మనస్సును కుదిపివేసి , ఆలోచనను ఆక్రమించి, అస్తిమితపరచగల కవిత్వం చాలా తక్కువగానే వచ్చింది. బహుశా కొద్ది తేడాలతో ఏ భాషలోనైనా ఇటువంటి శక్తిమంతమైన కవిత్వం సకృత్తుగానే వచ్చి వుండవచ్చు. అయినా, మనకి తెలియని భాషల గురించి తీర్మానాలెందుకు? తెలిసిన తెలుగుగురించే స్పష్టంగా మాట్లాడుకుందాం.

ఛందస్సులో వ్రాసినంత మాత్రం చేతనే కొందరికి ఏ వ్రాతయినా

కవిత్వమనే అభిప్రాయం వుండవచ్చు. కొందరికి పుష్కలంగా ఒక కథ, ఇష్టపడదగిన కొన్ని పాత్రలు, ఘటనలు, వర్ణనావకాశాలు, ఆశ్వాస విభజన, కలగలిసి బరువుగా వుంటే కవిత్వమనే అభిప్రాయం వుండవచ్చు. ఇంకా కొందరికి ఆవేశాలు, భక్తి ఒలకబోసుకోవడానికి, ఎంతో వీలున్న ముక్తక పద్ధతి శతకం కవిత్వంగా అనిపించవచ్చు. శాస్త్రాలు, అలంకారశాస్త్రం, చదువుకున్న కొందరికి వ్యాకరణ, శ్లేష, యమకాది చమత్కారాలు నిండినవీ, గణితంలో లాగ చిక్కుముడుల్ని దాచుకుని విప్పమనేవీ, పద్యాలు కవిత్వం కావచ్చు. మరి కొందరికి నీతి, వేదాంతం, రాజకీయం, వీరోచితకృత్యాలు, చెప్పగల బోధనాపటిమ కవిత్వం కావచ్చు. ఇంకొందరికైతే అలవోకగా హాస్య, వ్యంగ్య, శృంగారాలు పొంగే వట్టి చాటువులు అపూర్వ కవిత్వమనిపించవచ్చు. ఇవేవీ కావు, కొందరికి గాఢ భావుకతను మించిన కవిత్వం లేనేలేకపోవచ్చు. తరుచు చాలామంది పఠితలకు తమకు సమకాలికంగా జరిగే విషయాల గురించి ప్రస్తావిస్తూ ప్రసంగిస్తే కవిత్వం సార్థకమైనట్టు తోచవచ్చు. కొందరు ఎవరేమి కోరితే, దానిని- పద్యంలో కోరితే పద్యంలో, వచనంలో కోరితే వచనంలో , పాటగా అడిగితే పాటలో, - సరళత కావాలంటే సరళత, ప్రౌఢత కావాలంటే ప్రౌఢత, రంగరించి ఇతరుల - లేదా - పోషకుల 'కోరిక మెయి' ''చెప్పగలగడం'' కవిత్వమనుకోవచ్చు. దేవుడు, దెయ్యం, బూతు, నీతి, ప్రకృతి, పుణ్యపురుషుడు, త్యాగశీలి, వంటి ఇతివృత్తాలతో మాట్లాడగలిగి, వ్రాయగలగడమే చాలా మందికి కవిత్వం కావచ్చు. ఏది కవిత్వం? అనే నిర్ధారణ విషయంలోనే ఇన్ని వ్యత్యాసాలుంటే మంచికవిత్వం అంటే ఏది? ఆధునికకవిత్వం అంటే ఏది? అనే విషయంలో తేడాలు రావా? వ్రాసేవాళ్ల గాని, చదివేవాళ్ల గాని, మనుషులే కనక - మనుషుల అభిరుచుల్లో వున్నన్ని తేడాలు, 'కవిత్వమేది? మంచికవిత్వమేది?' అనే విషయంలోనూ వుంటాయి. వైవిధ్యం, అభిప్రాయభేదం, లేకపోతే ఈ ప్రపంచమే లేదు కదా!

తెలుగు ప్రాచీన కవిత్వం వైపొకసారి చూస్తే (కుకవుల సంగతి వదిలెయ్యండి, మంచికవులని కొన్ని శతాబ్దులుగా పేరుపడిన వారే) ''మంచి కవిత్వ''మనేదేమిటని ప్రశ్నవేసుకుని, లేదా నిర్వచించుకుని, ''తమ కవిత్వ విధానాన్నే '' ఉత్తమంగా పరిగణిస్తూ , ప్రకటిస్తూ వచ్చారు. వందల సంవత్సరాల మన తెలుగు కవిత్వపు నడవడి గమనించండి. స్వతంత్ర ఊహాశాలిత, అపూర్వ స్వీయ భావనాపటిమ చాలా తక్కువ.

ఎక్కడో కనీసం ఒక్క ఆధారశిల వంటి అంశం దొరికితే చాలు మనవాళ్లు మహాభవనాలవంటి ఆశ్చర్యం గొలిపే అదనపు కల్పనాశక్తి ప్రదర్శించ గలిగారు. ప్రాచీన కవిత్వ గాఢాభిమానులు విని భరించగలరో లేదో గాని, భారత సంహితా రచన బంధురుల మొదలు నిన్న మొన్నటి పద్యరచనా దక్షుల వరకూ ఇదే కథ - వెదికి చూడండి సంస్కృతంలోనో, ఉర్దూ, పర్షియన్‌లలోనో, ఇతర భారతీయ భాషల్లోనో కనీసం ఒక ఆధార రేఖయినా దొరికితీరుతుంది. తప్పపట్టడం కోసమో, గేలిచేయడం కోసమో చెప్పడం కాదిది- ఒక జాతిగా మన కవుల స్వభావాన్ని గుర్తించడం మాత్రమే.-ఈ లక్షణాన్ని గ్రంథచౌర్యంగా పరిగణించకుండా, వ్యుత్పన్నతగా, పాండిత్య ప్రకర్షగానే, చిరకాలంగా తెలుగు వాళ్లం గౌరవిస్తూ వస్తున్నాం -. ఇతివృత్తం ప్రఖ్యాతమా? మిశ్రమమా? కల్పితమా? అనే అంశంమీద కంటె - ఫలానా విషయాన్ని ఈ తెలుగుకవి, మనకి ఎంత బలంగా, ఎంత రసవత్తరంగా, ఎంత ఆకర్షకంగా చెప్పగలుగుతున్నాడు? అనేదానిమీదనే - పాఠకులు గాని, ఆలంకారికులు గాని, ఆధునిక విమర్శకులు గాని - ఒక కవి సామర్థ్యాన్ని అంచనావేస్తూ వచ్చారు. ప్రాచీనకవుల కవిత్వ సందర్భం ఇలా వుంది కదా, ఆధునిక కవులు ఇందుకు భిన్నులు అనుకోనవసరం లేదు - వీరి పద్ధతీ, పరిస్థితి కూడా అదే. - వీరేశలింగం దగ్గర మొదలుపెడితే వేగుంట మోహనప్రసాద్ వరకూ నిస్సందేహంగా ఇదే పంపిణీ. కానైతే, తెలుగు భాషకు సంబంధించినంత వరకూ కవిత్వంలో గాఢమైన కొత్త పలుకుబడినీ, వాక్య రసజ్ఞతనీ, గాలివాలునీ, వెలుగుచురుకునీ తీసుకువచ్చినది వీరే.-

ఆధునిక పద్యమంటే - రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, జాషువా, రామిరెడ్డి, దాశరథి వంటి కవులు మిలమిలమెరిసి పోతూ మన కళ్ల ముందు నిలబడతారు. గేయచ్ఛందం ద్వారా, వచనపు అమరిక ద్వారా, అత్యాధునిక కవిత్వానికి ఒక రూపమంటూ దిద్దిన కవులుగా శ్రీశ్రీ, తిలక్, అజంతా, శేషేంద్ర, ఇస్మాయిల్, మోహనప్రసాద్, తిరుగులేని స్వీయవ్యక్తిత్వాలతో దృఢంగా నిలబడతారు. ప్రాచీన కాలంలో నన్నయ, తిక్కన, పాల్కురికి సోమన, నాచన సోమన, నన్నెచోడదేవుడు, శ్రీనాథుడు, పోతన, పెద్దన, భట్టుమూర్తి, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి, పింగళి సూరన, చామకూర వెంకటకవి, కంకంటి పాపరాజు, రంగాజి, ముద్దుపళని.... మరి కాస్త ఇవతలికి వస్తే తిరుపతి వేంకటకవులు, వేంకట రామకృష్ణ కవులు, వేంకట పార్వతీశ్వరకవుల వరకు వారి వారి కవిత్వ

ప్రకటన పద్ధతులు ఎంత స్వతంత్రంగా తెలుగులో స్థాపించుకున్నారో ఇవాళ కొత్తగా చెప్పనక్కరలేదు. వీరి వెంట సమకాలికులుగా నడిచిన వారూ, వీరిలో ఎవరో ఒకరి ప్రేరణతో తరువాతి కాలంలో బలమైన తెలుగు పద్యం వ్రాసినవారూ కోకొల్లలుగా లేకపోలేదు. వారి వారికి దక్కవలసిన స్థానం, కాలగతిలో వారికి దక్కింది కూడా- అభినవ కవిత్వంగా భావకవిత్వంగా ప్రకటించుకుంటూ కొన్ని వందల రచనలు చేసినవారు కూడా లేకపోలేదు. హరీంద్రనాథ చటోపాధ్యాయం కాబోలును ''తెలుగులో ప్రతి రెండో వాడు కవి'' - అని అన్నాడు. ఇది ఫిర్యాదో, కితాబో, ఏ కాస్త కవిత్వం పట్టి చూడగలవారికైనా అర్థమైపోతుంది. ఏది యేమైనా, మొత్తం మీద తెలుగు సాహిత్య ప్రక్రియల్లో కవిత్వం పేరిట 'సరుకు' ఉత్పత్తి అనాది నుంచి ఎక్కువే.

ఒక్కసారిక్కడ నిలబడదాం. నిజాయితీగా ప్రశ్నించుకుందాం. మన భాషలో కవిత్వం వ్రాసే వ్యక్తి హోదా ఏమిటి? - ఒకప్పుడైతే వట్టి 'ఆశ్రితుడు'. ఆశ్రయించినది చక్రవర్తినా, ప్రభువునా, దుర్గాధిపతినా, జమీందారునా, గుర్రాలశాల నిర్వాహకుణ్ణా, జిల్లాబోర్డు ప్రెసిడెంటునా, ఊరివెూతుబరినా, అనే విషయంలో స్థాయీ భేదాలుతప్ప , గౌరవ విషయంలో కాస్త కాస్త అంతరాలు తప్ప , ఆశ్రయింపు గుణం గుణంగానే చెలామణీ అయింది. ఆ మాటకొస్తే, నాగరకత బాహ్య రూపం మారింది గాని, ఆశ్రయింపు గుణం ఇంకా కొందరిలో కొనసాగుతూనే ఉంది. కొనసాగుతుంది. ఇది ఒక తరహా కవిత్వ వ్యవసాయం. ఇక్కడ ''కవిత్వ గాఢత'' అసలు లక్షణం, కొందరు ఆశ్రయం ఇచ్చినవారికీ, ఆశ్రయించుకున్న కవిశబ్ద వాచ్యులకీ, ఇద్దరికీ తెలియదు కనక - ఈ అజ్ఞానానికి ఆకాశమే సరిహద్దు. వారు ధన్యజీవులు.

ఆంధ్ర దేశంలో, బెంగాలీ సంస్కరణోద్యమాల ప్రభావం చేతనూ, కాల్పనిక సాహిత్య పరిచయ ప్రభావం చేతనూ, సమాజంలో మాట ఎలా వున్నా, కవి హోదాలో మార్పు వచ్చింది. అతని ఇతివృత్త పరిధి మారింది. చూపు మారింది. స్వాతంత్ర్యోద్యమం, జాతీయోద్యమం, కాల్పనికోద్యమం, మానవోద్యమం, అతన్ని ఆవహించి వేరువిధమైన పూనకంలో పడవేశాయి. కవిలో పరిణమించిన ఈ మార్పును గుర్తించి, కృష్ణశాస్త్రిగారొకప్పుడీ పద్యం వ్రాశారు.

కవిభట్టు కాడులూకము కాడు, ప్రాణాగ్ని
యెడలిన శవము కాడివము కాడు,

ఒకరిని భూషింప, డొకరినేన్ ద్వేషింప,
డాతని గుండె క్షీరాబ్ధియంత,
కవి మన స్సెగయు జంగమ విహంగము, ఉద
యారుణాంశువు లెదురైన జడియ,
డసికొసకవిమన స్సది అరయును దొల్చి
యెల్ల కల్లల, నెల్ల యెల్ల లొల్చి,
లేదు భయము, నిస్పృహ లేదు, లేదు తృప్తి,
శీతలత లేదు, జడత లే, దాత డొరసి
యొరసి తిరుగాడు ప్రతిజీవి నరసి, నివురు
కప్పని తరుణ విస్ఫులింగ మ్మతండు

తెలుగు కవిత్వ చరిత్రలో మార్పుకు గురైన ఈ తరహా కవి వ్యక్తిత్వం 1910-1935 మధ్య క్రమ వికాసం పొందింది. 1936 తరువాత నుంచి నిశిత నిశితమై అనేక ఉద్యమాలు, ఘటనల ప్రేరణలతో, తెలుగు కవిత్వ స్వరూప స్వభావాలనే మార్చివేసింది. ఒక ప్రభువు దగ్గర ఆశ్రితుడుగా వుండి, ''వారి '' అభిరుచుల కనుగుణంగా రచన చేసి, అంకితమిచ్చే దశ నుంచి - తెలుగు కవి, తన సమకాలీన ఘటనల్లో, అనుభవోద్రేకాలలో, - తన మనస్సుతో- తానెరిగిన జీవితానికీ, తాను నమ్మిన లేదా ప్రేరణ మాత్రం పొందిన సిద్ధాంత మార్గానికీ, ''ప్రవర్తక'' హోదాలోకి మారాడు. ''మారాడు'' అనడానికి ముందు ఒక ముఖ్యమైన మినహాయింపును కూడా గుర్తుపెట్టుకోవాలి. అభినవ కవిత్వం లేదా భావకవిత్వం అంటూ కొత్త ధోరణులు తెలుగు కవిత్వంలో ప్రవేశించిన 1910-1935 మధ్య కాలానికీ, ఆ తరవాత ప్రవేశించిన ధోరణులకీ చాలా తేడా వుంది. తొలికాలంలో ఎక్కువగా భావుకుడూ, స్వాప్నికుడూ అయితే- 1936 తరవాత నుంచి పెరుగుతూ వచ్చిన కవి సహజోక్తికీ, వీరోక్తికీ ప్రాధాన్యమిచ్చాడు. తన కవిత్వనిర్మాణ శక్తిని ఇతరుల అభిరుచులకు ''ఆశ్రితం'' చేయడం మానేసి, తన భావప్రకటనలకీ, ప్రేరణ ప్రకటనలకీ ఆధారం చేసుకున్నాడు. అప్పటి నుంచే అత్యాధునిక కవి తానొక ''వ్యక్తి'' గా మరొక పాఠక ''వ్యక్తి''ని సంబోధించడం మానేసి, - ఉపన్యాసం మాదిరిగా ''సమూహాలను'' (సమాజం) ఉద్దేశించి పలకడం సాగించాడు. ఇందుకు సంప్రదాయగేయచ్ఛందాన్ని సాగినంత వరకు ''స్వచ్ఛందం'' గా సాధించుకున్నాడు. 1940ల తర్వాత

అభ్యుదయ కవిత్వంగా గొంతువిప్పిన కవిత్వసారం ఇదే. గేయచ్ఛందం స్వచ్ఛందం అయి అయీ, వచన పద్యం, వచన గేయం, వచన కవిత్వం పేరిట రకరకాల ఉరవడులకు గుర్తై, - 1960 ల నాటికి మనకొక స్వయం ప్రకటిత వచన కవితా పితామహుణ్ణి ప్రదానం చేసింది. ఆయన పేరు శ్రీ కుందుర్తి ఆంజనేయులు. వచన కవితా ఉద్యమం పేరిట ఆయన వచనం ఎక్కువగానూ కవిత్వం సత్కృత్తుగానూ వ్రాశారు. అయితే ఆయన హృదయధర్మం గొప్పది. ఆయన ప్రచారం చేస్తున్నామనుకున్న వచన కవితా ఉద్యమం, ఆయన కవిత్వ బలం కంటె ఆయన ఇతరుల పుస్తకాలు కొన్నింటికి వ్రాసిన పీఠికాబలం వల్లనే ఆ మాత్రం ప్రచారమైంది. ఒక ప్రక్రియని ఉద్యమం చేయబూనడమే ఆయన అమాయకత్వంగా పరిగణించి ఈ ప్రస్తావన ఇంతటితో వదిలివేయడం మంచిది.

ఈ వచన కవితా ఉద్యమం ప్రబలిపోతోందని భావించిన కొందరు పద్య కవులు, కుందుర్తి గారి ''ప్రక్రియోద్యమ'' దీక్షతోనే ప్రతిస్పందించి, సమకాలికమైన రకరకాల ప్రభుత్వ, ప్రభుత్వేతర పథకాల గురించీ, కుటుంబ సంక్షేమం, చెట్లు నాటడం, పొదుపు చేయడం వంటి అనేకానేక విషయాల గురించీ, పద్యాలు వ్రాసి, ''మాది మాత్రం ఆధునికకవిత్వం ఎందుకు కాదు?'' అని ఎదురువచ్చారు. సారాంశం గ్రహించవలసిన దేమంటే, పద్య కవితా ఉద్యమకారులూ, వచన కవితా ఉద్యమకారులూ కూడా ఒకే స్థాయి అజ్ఞాన వేదికల మీద నిలిచిపోయి - కవిత్వమనే మహత్తర అనుభవాన్ని వాళ్లు దక్కించుకోలేదు. పాఠకుల్ని దక్కించుకోనివ్వలేదు.

సిసలైన విషయం: వచనంలో చెప్పినా, పద్యంలో చెప్పినా, పాటలో పాడినా, కవిత్వమనేది వేణువులో గాలి వంటిది. వేణువులో గాలి, ఊదేవాడి మనోధర్మాన్ని బట్టి సంగీతం ఎలాగవుతుందో, ''ప్రక్రియ''లో కవి మనోధర్మం కవిత్వమవుతుందని మనం గ్రహించాలి. చర్చలు, గ్రంథ ప్రచురణలు, పురస్కారాలు, సన్మానాలు, పదవులు, అకవిని 'కవి'ని చేయవచ్చేమో గాని, అకవిత్వాన్ని కవిత్వంగా మార్చజాలవు.

1936 నుంచి 1996 వరకు - అరవై యేళ్ల కాలంలో - తెలుగు కవిత్వం నడిచిన నడకను ''పట్టాల పంపిణీ'' తరహాలో ఒక చోట గుదిగుచ్చడం కోసం కాదీ సంకలన ప్రయత్నం. నడిచిన రకరకాల ఉద్యమాలకు కవిత్వం పేరిట, ప్రాతినిధ్యం పేరిట, ''పచారీకొట్టు జాబితా''

తయారుచేయడం కాదీ సంకలన ప్రయత్నం. -

పద్యం వ్రాయడమే కవిత్వమనుకునే వాళ్లూ - రకరకాల రాజకీయ పంథాల వ్యూహాలు, నియమావళి, ఏకరువు పెట్టడమే కవిత్వమనుకునేవాళ్లూ, - లింగ వివక్ష న్యూనతనీ, కులవ్యవస్థ న్యూనతనీ, కసిగా ఆక్రోశంగా, వెళ్లబోసుకోవడమే కవిత్వమనుకునేవాళ్లూ, చాలా సందడిగా ఆయా పనుల్లో నిమగ్నమై వున్నారు. ఆయా ఆక్రోశాలను కవిత్వంగా అభివర్ణించుకునేవాళ్లను అభివర్ణించుకోనివ్వండి - మతానికి లాగే కవిత్వానికీ కులపీఠాలు, గురుపీఠాలు వెలిశాయి. వర్ధిల్లనివ్వండి--

సమాజమంటూ ఒకటివున్నాక, సందడులు తప్పవు. సమరాలూ తప్పవు. సమాధానపడటమూ తప్పదు. పేకముక్కలంటూ ఆటలో వున్న తరవాత ఒకొక్కసారి ఒకొక్క చేతిలో ముక్కలు దక్కడాన్ని బట్టి గెలుపోటములు ఊగులాడుతుంటాయి. ప్రజాస్వామ్యంలో వున్నాం కదా! అందరూ ప్రజలే అయినా, కొందరు స్వాములకి కొందరే ప్రజలుగా కనిపిస్తూండడం పరిపాటైనప్పుడు, కవిత్వం విషయంలో కూడా కవిత్వస్వామ్యం తరతమాలను నిర్ణయించుకోవడం కోసం తపనపడుతూంటుంది. రాజకీయమే సర్వప్రాపంచిక విషయాలకీ చోదకశక్తి అని నమ్ముకున్నవాళ్లకి కవిత్వం విషయంలో ఇంకొక తరహా అభిప్రాయాలుండే అవకాశం లేదు - ఎందుకీ కవిత్వం? అని ఎవరైనా ప్రశ్నిస్తే , అటువంటి వాళ్ల సమాధానం చరమసత్యం కాదని చెప్పడం కోసమే యీ కవిత్వ సంకలనం -

1935లో వైతాళికులు సంకలనం వచ్చింది. ఖచ్చితంగా తేదీల వారీ లెక్కకాకపోయినా, 1910 నుంచి 1935 వరకు కొత్తగా తెలుగు కవిత్వంలో వచ్చిన మంచి పరిణామాలకు సమర్థులైన 28 మంది కవులు ఎలా ద్వారాలు తెరిచారో ఆ సంకలనం ద్వారా, శ్రీ ముద్దుకృష్ణ నిరూపించారు. అప్పటికి, ఆ కవుల్లో నవ యువకుడు శ్రీశ్రీ. వయస్సు 25 ఏళ్లు. వ్యక్తిని సంబోధించడం మాని, సమూహాలను సంబోధించడానికి అప్పుడప్పుడే ఉద్యుక్తుడవుతున్నాడు. వ్యక్తికి బహువచనం శక్తి అని నమ్ముతున్నాడు. కనక - ఆ యువకుడు, తెలుగు కవిత్వానికొక సరిహద్దు. దాదాపు వెయ్యేళ్లుగా కొండలాగ పరుచుకున్న ఒక తరహా తెలుగు కవిత్వాన్ని బద్దలుకొట్టి, ఆ ప్రయత్నంలో ఉబికి వచ్చిన కొత్త 'జల'ను,

భగీరథుడిలాగ, వెంటపెట్టుకుని ముందుకి నడిచినవాడు. ఆయన ఒక స్వప్నం. ఒక గందరగోళం. ఒక ఉద్యమం. సమూహాలను సంబోధిస్తూ కూడా, 'వ్యక్తి' అంతరంగం లోకి ఏకకాలంలో చూడగలిగిన కవితాసంచారి. తన మహాప్రస్థాన గీతాల సంపుటాన్ని వెలువరించడం చాలా ఆలస్యం చేసినా 1940 నాటికే సిద్ధం చేసుకున్నాడు. అందులో చేర్చిన మొత్తం 40 గీతాలలో (అంకితం కాక) 1934లో 14, 1937లో 8 తప్ప -- 1933-1947 మధ్య కాలంలో వ్రాసిన గీతాలు 4,3,2,1.....లెక్కన వున్నాయి.

మొత్తం మీద శ్రీశ్రీ అనే వ్యక్తి, కవిత్వ స్వరూపం మార్చడానికి చేసిన మహత్తర ప్రయత్న కాలం 1933-1939 మధ్య ప్రముఖం. 1936 వ సంవత్సరం మన చాంద్రమానం ప్రకారం యువ నామ సంవత్సరం. 1935 లో వైతాళికులు ప్రచురణ తెలుగు కవిత్వపు తొలి ఆధునిక ఛ్చాయల్ని ప్రసరిస్తే- 1936 కొత్తదనాన్ని ముందుకు నడిపే 'యువ' సంకేతంగా, ఇక్కడ తీసుకున్నాం. అక్కడ నుంచి ఒక అరవై యేళ్ల ఆవృత్తి. 1996 మళ్లీ యువ నామ సంవత్సరం - 1936 నాటి యువకుడు శ్రీశ్రీ పరిణతి ఒకలాగ వుంటే, 1996 నాటి యువకవుల పరిణతి వేరు విధంగా వుంది. 1943 ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం స్థాపన. 1965 దిగంబర కవితా ఉద్యమం ప్రారంభం. 1970 విప్లవ రచయితల ప్రవేశం. 1975 ప్రాంతం నుంచి అనుభూతి కవుల వ్యాసంగం. 1986లో 'యుద్ధోన్ముఖంగా' అనే జయప్రభ కవిత్వసంపుటానికి చివరిమాట సందర్భంలో శ్రీ వెల్చేరు నారాయణరావు 'ఆడగొంతులో వినిపించే, ఆడ విషయాలను, గుర్తించడం, ఒక విధంగా తెలుగులో స్త్రీ వాద ఉద్యమానికి నాంది. (అంతకుపూర్వం రేవతీదేవి కవిత్వం ఉన్నప్పటికీ.) ఆ తరవాత 1990 దశకం మధ్య నుంచి క్రమక్రమంగా పుంజుకుని, 'దళితవాద కవిత్వం' తలెత్తుకుంది. స్థూలంగా - అత్యాధునిక కవిత్వ ప్రస్థానంలో 1936-1996 మధ్య గడిచిన ఘట్టాలివి- ఇక్కడొక తమాషా వైరుధ్యం గమనించాలి. కులపరంగా, బ్రాహ్మణాధిక్యం ఇంకా కొనసాగుతున్న 1936 నాటికి శ్రీశ్రీ తన బ్రాహ్మణ్యానికి స్వస్తి చెప్పి, మరో ప్రపంచం పేరిట సామ్యవాద సమాజం కోసం కల కనడం తన కవిత్వం ద్వారా ప్రారంభించి, నడక సాగించగా - 1996లో బ్రాహ్మణాధిక్యం దాదాపుగా అన్ని రంగాలలో అడుగంటిన కాలంలో- ఇంకా బ్రాహ్మణాధిక్యాన్ని నిరసిస్తూ , కుంభవృష్టిగా నిందిస్తూ - మన తెలుగు

సమాజం కుల విభజన దిశగా ప్రయాణిస్తున్న విచిత్ర వైరుధ్యం ఇది- కుల భావాన్ని సమూలంగా పెరికిపారేసి, వర్గవిభజన (కలవాళ్లు - లేనివాళ్లు) ప్రాతిపదికగా కార్మిక వర్గ నియంతృత్వం కోసం శాస్త్రీయంగా కమ్యూనిస్టులు సాగించదలచిన ఒక 'ఆదర్శ సమరం', పరమ విషాదంగా ఇలా ప్రస్తుతానికి ముగిసిందని చెప్పడమే ఇక్కడ ఉద్దేశం. కమ్యూనిస్టులు పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రంగా, అన్ని సమాజ వైరుధ్యాలకీ ఆర్థిక కారణాలను చూపించడం తప్పు కావచ్చేమో కాని,- ఆధునిక, సమకాలీన (తెలుగు) మానవుడి మీద రాజకీయ ప్రభావం వుండి తీరిందనేది మాత్రం, నిజమని తేలిపోయింది--

ఇక -సారాంశంగా చెప్పగలిగినదేమంటే, ఇవేవీ గొప్పకవిత్వం జనించడానికి ద్వారాలు తెరవలేకపోయాయి.

గొప్ప కవిత్వమంటే?--

శ్రీశ్రీ చెప్పినట్టు ''సైజూ, బరువూ క్రైటీరియా కావు''.

తిలక్ చెప్పినట్టు '' అంతరాంతర జ్యోతిస్సీమల్ని వెలిగించాలి''.

చలం చెప్పినట్టు ''వ్రాసేటప్పుడు మన శ్వాస ఇబ్బందిపడాలి. రక్తం పొంగాలి''.

వేణువులో దూరిన గాలిలా, గొప్ప అనుభవం వినిపించగలగాలి. అయితే, అందుకు ఎవరి వేణువు వారే తయారు చేసుకోవాలి.

''బాధపడాలి, నలగాలి
జీవిత రథచక్రాల క్రింద.
కలంలోంచి నెత్తురు వొలకాలంటే
అక్షరాలా? పాండిత్యమా?
కాదు--
సంవత్సరాల మూగవేదన''

ప్రమాణంగా చెప్పిన చలం 'ఘోష' బోధపడాలి.

అందరం జీవించినట్టే మనమూ జీవిస్తాం కొన్ని కోట్లమందిమి. పెళ్లాడి పిల్లల్ని కంటాం. ఉద్యోగాలు చేస్తాం. సంపాదిస్తాం. ఇళ్లు కడతాం. చావు భయంతో భక్తులమవుతాం. కాని, చచ్చిపూరుకుంటాం. సూక్ష్మంగా ఇదే జీవితం. దీనినే కెలైడోస్కోప్ లాగ ఇటూ అటూ తిప్పి , రకరకాల

''కలగాపులగపు బలవత్ ఝురవత్ పరివర్తనలో'' కలల్ని, కళల్ని కంటాం.

మంచి కవిత్వమంటే ఒక 'కల కనడం'.

మంచి కవిత్వ మంటే ఒక ఘటనకి ఊగిపోవడం.

మంచి కవిత్వమంటే మనస్సు మీద మేఘం పరిచి 'ఊగట సస్యాలు' పండించడం.

మంచి కవిత్వమంటే ఇవాళ ఇరులు మూగే సంధ్యాకాశాన్ని చూస్తూ ఏడవడం కాక, రేపటి ఉజ్జ్వల ఉదయం కోసం ఉత్సాహంగా ఎదురుచూడడం.

కవిత్వమంటే కాఫ్కా వాక్యం.
ఖలీల్ జిబ్రాన్ వచనం.
కృష్ణశాస్త్రి నిట్టూర్పు.
జాషువా ఆక్రోశం.
విశ్వనాథ గద్గద కంఠం.
శ్రీశ్రీ కేక.
ఇవే... ఇవే ప్రమాణాలు.

అత్యాధునిక తెలుగు కవిత్వంలో 'కవిత్వం' అనదగిన అంశాలు చాలా తక్కువ- వీటిలో దృశ్యాలున్నాయి. వ్యక్తులున్నారు. జ్ఞాపకాలున్నాయి. హెచ్చరికలున్నాయి. అనుభవాలున్నాయి. వేడికోళ్లు, క్షమార్పణలు, దృశ్యాలకు అభిప్రాయాల సమన్వయాలూ ఉన్నాయి. వ్యక్తులు వ్యక్తుల్ని సంబోధించేవీ, వ్యక్తులు సమూహాలను సంబోధించేవీ కూడా వున్నాయి. మనం ఎరిగిన విషయాలే. ''అరే, ఇది మనం గమనించలేదు సుమా!' అనే వింత ఆశ్చర్యాన్ని, స్మృతినీ కలిగిస్తుంది వీటిలో కవిత్వం.

''యువనుంచి యువదాకా'' సంకలనం కోసం మొత్తం అరవయ్యేళ్ల కాల వ్యవధికి చెందిన 164 మంది కవుల రచనలు చదివాను. చదివిన పద్యమే నాలుగు సార్లు చదివి, వాటి నుంచి 73 కవితలు ఏరాను. 44 కవుల రచనలివి. ప్రసిద్ధులతో సహా 120 మందిని విడిచిపెట్టుకున్నాను. వీరిలో చాలామంది వ్యక్తిగతంగా నాకు మంచి మిత్రులు. నేనూ కొంత సందడి చేసినవాణ్ణే అయినా, నా రచనలేవీ కూడా ఇందులో చేర్చలేదు.

ఉద్యమాలను ప్రతిబింబించాలని గాని, ఉద్దేశాలను ఏకబిగిని

ఉపదేశించాలని గాని, ఈ సంకలనం ప్రయత్నించలేదు. అనేకవ్యక్తులు కాలంలో రకరకాల పరిస్థితులు దాటుకుంటూ ఒకరి తరవాత ఒకరు ఒకరి పక్కన ఒకరు, ఒకరికి కాస్త దూరంగా జరిగి మాట్లాడారు. మనిషి కవసరమైన గుండె తడితో,- ఎటువంటి కవిత్వం చెప్పారో ఆవిష్కరించడం మాత్రమే ఇక్కడ ముఖ్య లక్ష్యం. జీవితం విలువైనది, సుఖమైనది, జీవించడానికే ప్రవేశించాం. కష్టదుర్భరమో, రసనిర్భరమో, మొత్తం మీద ఎవరికి దక్కవలసింది వారికి దక్కుతుంది. నిర్వచనాలు, నీతివాక్యాలు, నినాదాలు, శాశ్వత ప్రాతిపదిక మీద ఎవరినీ శాసించజాలవు.

రకరకాల పరిస్థితుల్లో, ఉద్రిక్తతల్లో, సంకీర్ణతల్లో, ఆశనిరాశల్లో, అహ్లాదాల్లో, విషాద విష్కంభాలలో, పడి లేచి, సుడులు తిరిగి, ప్రాణస్పందనతో, జీవ చైతన్యంతో మాట్లాడే ''మనిషి'' ఈ సంకలనవాద్యగోష్ఠికి ఇతివృత్తం --.

ఆధునిక వచనపద్యం, గీతం, ఒక మహా కావ్యంలోని కథన ''భాగాలు'' కావు. దేనికదే ఒక కావ్యం. దేనికదే చిన్న ఆవరణం. ఇటువంటి చిన్న చిన్న ఆవరణలున్న కావ్యసందోహాన్ని ఒక చోటకు చేర్చి - ఒక ఇతిహాసంలో ఘట్టాలకుండే సామరస్యం కుదర్చాలని - ఇక్కడ నా ప్రయత్నం. ఈ ప్రయత్నం ఒక వాద్యగోష్ఠి (సింఫొనీ) నిర్వహించడం వంటిది కవుల్లో రకరకాల వాళ్లుంటారు. వారి వారి నాద స్వభావాలు, తార, మధ్యమ, మంద్ర స్థాయులు, భావాకృతులు వేరువేరు. ఒక సింఫొనీలో పాల్గొనే తీగవాద్యాలన్నింటి నాదం తీరుగాని, వాయువాద్యాల, చర్మవాద్యాల ధ్వనుల తీరుగాని, ఒకటిగా వుండవు. అన్నింటికీ మించి ఆయా వాద్యకారుల మనోధర్మాలు వేరు. ఒకే సమాజంలో మసలుతున్నంత మాత్రాన, ఒక వయోవర్గానికి చెందినంత మాత్రాన, ఎన్నెన్ని భేదాలు చూడం మనం? అయితే , వాద్యగోష్ఠి (సింఫొని)లో 'కండక్టర్' అన్ని వాద్యాలకీ ఒక శ్రుతి కుదురుస్తాడు. విడివిడిగా పలికినా, కలివిడిగా పలికినా, వాద్యాల అనేకత్వంలో తన ఇతివృత్తానికొక ఏకత్వాన్ని సాధిస్తాడు. ఇక్కడ సమూహం, వ్యక్తి , అవిభాజ్యాలు.

సరిగ్గా ఇటువంటి 'కండక్టర్' పనే ఈ సంకలనం కూర్చడంలో నేను చేశాను. నా ఇతివృత్తం ''సమాజంలో వ్యక్తి''.

అలవాటై పోయి, విసుగెత్తించి, తిక్కెత్తించే రాజకీయ కులమత విభక్తులు, స్వభావతః నాకు రుచించవు. ఇది కవిత్వమౌనా? కాదా?

అనేదే నాకు ప్రమాణం. నేను విడిచిపెట్టిన వాళ్ళు ఎంత గొప్పవాళ్లైనా కావచ్చు. ఏ కులమతాల వాళ్లైనా కావచ్చు. ఈ వాద్యగోష్ఠి (సింఫొనీ) శ్రుతిలోకి ఒదగరనుకునే విడిచిపెట్టాను.

1935లో తొలిసారిగా 'వైతాళికులు' సంకలనం వచ్చింది. 1946లో శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రి సంపాదకత్వంలో 'మహోదయం' సంకలనం వచ్చింది. 1953లో రెంటాల గోపాలకృష్ణ సంపాదకత్వంలో 'కల్పన' వచ్చింది. ముద్దుకృష్ణ సంపాదకత్వంలోనే 1959లో 'నవీన కావ్యమంజరి' వచ్చింది. 1959లో శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు సంపాదకత్వంలో 'తెలుగు కావ్యమాల' వచ్చింది. అదే పేరుతో అదే కేంద్ర సాహిత్య అకాడమీ శ్రీ దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వంలో మరో సంకలనం 1984లో ప్రచురించింది. ఇంకా శ్రీశ్రీ యుగం, తరంతరం, కవితా ఓ కవితా, పొయెట్రీ వర్క్‌షాప్ వారి సంకలనం, వచ్చాయి. 1975లో శ్రీ నండూరి రామమోహనరావు, నేను కలిసి విజయవాడ చైతన్యభారతి సంస్థ కోరిక మేరకు ఒక ''మహాసంకల్పం'' తెచ్చాం.

దిగంబర కవులు వచ్చాక - పైగంబరులనీ, తిరుగబడు కవులనీ, చేతనావర్తం కవులనీ ''గ్రూపు'' కవుల సంకలనాలు వచ్చాయి. ఝంఝ, లే, వంటి సంకలనాలను విరసం ప్రచురించింది. ఇలా చెప్పకుంటూ పోతే, చిన్నా, పెద్దా సంకలనాల జాబితా దాదాపు యాభై దాకా చేరవచ్చు. ఇంకా ఎక్కువే కావచ్చు.

ఇన్ని వుండగా మళ్లీ మరో సంకలనం ఎందుకు? - అని అడిగితే, -

''మరల నిదేల రామాయణం బన్నచో
తన భక్తి రచనలు తనవికాన....''

అని విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్టు నేనని వూరుకోను -

ఇక్కడొక ఆసక్తికరమైన విషయం చెప్పాలి.'కవిత్వం' , 'మంచి కవిత్వం', అని వ్యవహరిస్తున్నాం కదా! అది చాలదా? ఆధునికకవిత్వమనీ, ప్రాచీన కవిత్వమనీ, విభజనరేఖ అవసరమా? --అనేది ప్రశ్న. ఈ ప్రశ్న ఇవాళటిది కాదు ; నిన్న వుంది. రేపు ఉంటుంది.

నిజమే - మంచి కవిత్వానికి ప్రాచీన, ఆధునిక భేదాలు లేవు. హైకూ, 'గాథ', గజల్, వంటి గొప్ప 'సంప్రదాయ' రచనలు ఈ భేదం పట్టించి చూస్తే ఏమైపోవాలి? --'సంప్రదాయ' మంటే కవిత్వ సంప్రదాయమని

ఇక్కడ నా ఉద్దేశం. అయితే - కాల సంబంధమైన దృష్టితో, భావావిష్కరణ ధోరణుల మార్పు దృష్టితో ఈ 'ప్రాచీన' 'ఆధునిక' భేదాలు బహుశా ఏ కాలంలోనూ తప్పవు. ఉదాహరణకి కవిత్రయం వ్రాసినవీ పద్యాలే. శ్రీనాథుడు వ్రాసినవీ పద్యాలే. ముద్దుపళని వంటి దక్షిణాంధ్ర కవులు వ్రాసినవీ పద్యాలే. పద్యానికి పారశీక పరిమళం తెచ్చిన దాశరథివీ పద్యాలే- కాని, ఆయా కాలాలలో వాటి ''అల్లిక విధానం''లో మార్పు ఉంది. ఇతివృత్త స్వభావంలో మార్పు ఉంది.

ఈ మార్పు వట్టినే బాహ్యంగా రూపగతమైనది కాదు. కవి భావుకత్వపు 'ఆత్మ' మారింది. ఋతువులు మారినప్పుడు కొన్ని బాహ్యమైన మార్పుల్ని బట్టి ఋతువు మారిందని గుర్తించినట్టే కొన్ని బాహ్యమైన మార్పుల్ని బట్టి ''కవిత్వ ఋతువు'' మార్పునుకూడా గుర్తిస్తుంటాం. కాని - ప్రతి ఋతువుకీ పైకి కనపించని ఒక ఆత్మగుణం వున్నట్టే, మారిన కవితా ఋతువుకి కూడా ఒక ఆత్మగుణం వుంటుంది. ఈ ఆత్మగుణాన్నే ఒక పరిభాషగా ''ఆధునికత'' అని వ్యవహరించవలసి వుంటుంది. ఒక్కొక్కసారి ఒక కాలంలో అవతరించిన ఇటువంటి ఆధునికత, 'సమకాలికం'గా ఎక్కువ గుర్తింపు పొందలేకపోయినా, కొంతకాలం ''గడిచాక'' అపూర్వాదరణపాత్రం కావచ్చు కూడా. ప్రాచీన కవుల్లో పింగళి సూరన 'కళాపూర్ణోదయ' కావ్యం, ఆధునిక కవుల్లో కృష్ణశాస్త్రి ఖండకావ్యం, సూక్ష్మంగా ఇందుకు ఉదాహరణలు.

కొందరికి ''సమకాలీన'' మైనదంతా ''ఆధునికమే'నసే ఊహ వుంది - ఇది వట్టి భ్రమే - ఒక్కొక్క సందర్భంలో, ప్రాచీనమైనదే తిరగబడి పునః ప్రవేశం చేసి, ఆధునికమై కూర్చుంటుంది. ఇందుకు ఉదాహరణగా మన వస్త్రధారణలో 'నాగరకత'ను గ్రహించవచ్చు.

ఏతావాతా తేలిందేమంటే: సమకాలీనతకీ, ఆధునికతకీ వట్టి శబ్దార్థపరమైన సంబంధం తప్ప, తాత్త్విక సంబంధం ఏమీ లేదని -

విశేషించి - మంచి కవిత్వం పలకడం మీద సూక్ష్మదృష్టి వున్న ప్రతి గొప్ప కవీ, తనకంటె ముందరి కాలంవాడో, తన పక్కనే వున్న మరో గొప్ప సమకాలంవాడో, పలికినట్టు పలకడానికి ఇష్టపడడు. ఈ లక్షణానికే ''సొంత గొంతు వెతుక్కోవడం'' అని కృష్ణశాస్త్రి పేరు పెట్టారు. ఆయన, విశ్వనాథ, జాషువా, రామిరెడ్డి, రాయప్రోలు వంటి కవులు ''సొంత గొంతు'' పలికించడం ద్వారానే ఆధునికులయ్యారు. వారిలాగ

పలకకూడదనే పట్టుదల వల్లనే శ్రీశ్రీ తన కవిత్వ స్వరూప, స్వభావాలు రెండూ మార్చుకొని తన సొంత గొంతు వినిపించి ఆధునికుడయ్యాడు. ఇలా ఒక కవికంటె భిన్నంగా ఇంకో కవి ''సొంత గొంతు'' వినిపించినప్పుడే విలక్షణ కవి అయ్యాడు. కవి సూక్ష్మ దర్శన శక్తికి తోడు అతడి చదువు, సంస్కారం ''సమకాలికం''గా తప్పక దోహదం చేసి వుండవచ్చు. ''ఆధునిక'' కవులని గణనీయంగా నేను పేర్కొన్న శ్రీశ్రీ, తిలక్, అజంతా, ఇస్మాయిల్, శేషేంద్ర, మోహనప్రసాద్, ఇటువంటి ఆధునికులు - ఒకరినొకరు అనుకరించలేరు. ఒకరి సృజనకీ మరొకరి సృజనకీ, వాక్య నిర్మాణ శైలిలో ఎక్కడ నుంచీ, ఎంతో తేడా వుంది. ఇందులోనే ఆధునికత జీవలక్షణం ఇమిడి వుంది. అనాదినుంచీ కూడా ఇటువంటి వారి వల్లనే కవిత్వం ''ఆధునిక''మవుతూ వచ్చింది. ఇది భావ ''వ్యక్తీకరణం''లో, ఇతివృత్త''[illegible]''లో, జమిలిగా అల్లుకొని వుంటుంది.

మధ్యయుగాలనాటి ఒక చైనా కవి అన్నాడట :

''మాటలూ అవే., వాటి అర్థాలూ అవే. ఒక్కొక్కసారి అవి ''కవిత్వ''మవుతాయి. నేను ''నీ కవిత్వాన్ని'' వ్రాయజాలను, ''నీ కలల్ని'' నేను కనజాలనట్లే'' అని. కడు పాతకాలం నుంచీ అలవాటైన మానవ జీవన వ్యధనీ, అం[illegible] కథనీ, ఎప్పటికప్పుడు 'నవంనవం'గా వ్యక్తం చేయగలగడమే [illegible] పరిభాషలో ''ఆధునికత'' అని మనం గ్రహించాలి. ఆధా[illegible] ''మనిషితనం'' మాత్రం కొనసాగుతూనే వుంటుంది.

సాహిత్య సందర్భంగానే ఈ అనివార్యతనీ, ఆవశ్యకతనీ, [illegible] పాఠకులకి గుర్తుచెయ్యడం కోసమే ఆధునిక కవిత్వం వుంది - వుంటుంది - ఈ జీవ లక్షణంగల కవిత్వం. ఏ నాటిదైనా ''[illegible]'' కోల్పోదని మనం గ్రహించాలి.

ఇక - ఈ సంకలనం కూర్పులో వివిధ కవుల కవిత్వాన్ని నేను అమర్చిన తీరు గురించి ఒక మాట చెప్పాలి. మంచి కవులలో 'సీనియర్లు', 'జూనియర్లు' అంటూ వయస్సుని బట్టీ, కవిత్వం వ్రాయడం మొదలు పెట్టిన తేదీలని బట్టీ ఎప్పుడూ వుండరు. కవులలో రెండే జాతులు. కొందరు కవులు. కొందరు అకవులు - అంతే. నేను అనుసరించిన పద్ధతి ప్రకారం వట్టి 'వయోవర్గం' [illegible] శ్రీశ్రీ నుంచి తెన్నేటి సూరి వరకు ఒక దళంగా, - అబ్బూరి వరద రాజేశ్వరరావు నుంచి నారాయణరెడ్డి వరకు ఒక

దళంగా, - నగ్నముని నుంచి సుబ్బారావు పాణిగ్రాహి వరకు ఒక దళంగా, - గుంటూరు శేషేంద్రశర్మ నుంచి శిఖామణి వరకు ఒక దళంగా, - నాడ్రేవు చినవీరభద్రుడు నుంచి త్రిపురనేని శ్రీనివాస్ వరకు ఒక దళంగా - అమర్చాను. నిజానికి గుంటూరు శేషేంద్రశర్మ, ఇస్మాయిల్, వయసు దృష్ట్యా అభ్యుదయ కవుల తరంలో పడవలసినవారే అయినా, వారు వ్రాసిన కవిత్వ ''కంఠరవం'' దృష్ట్యా నగ్నముని - సుబ్బారావు పాణిగ్రాహి దళం తరవాత దళంలో చేర్చాను. ఈ సంకలనంలో నాకు, వచన పద్యాలలో వచ్చిన వైవిధ్యం ముఖ్యం. ఇతివృత్తాలలో మార్పు ముఖ్యం వారి వారి వయస్సులు కానే కావు.

ఇక - రేవతీదేవి, జయప్రభ, కొండేపూడి నిర్మల, విమల అనే నలుగురు స్త్రీలను ఒక దళంగా చివరలో చేర్చడంలో ప్రత్యేకించి ఉద్దేశాలేమీ లేవు. ఈ నలుగురివీ చాలా విభిన్న కంఠాలు స్త్రీవైపునుంచి వీరు యీ లోకాన్ని ఎలా చూశారో చెప్పడం కోసమే ఒకచోట చేర్చాను. అన్నిటికీ మించి ఈ సంకలనాన్ని కవిత్వ ప్రమాణంతో కూర్చానుగాని, కాల ప్రమాణంతో, కవుల వయస్సు ప్రమాణంతో కూర్చలేదు.

''యువనుంచి యువదాకా'' సంకలనం రావడానికి కారణం, అప్పాజోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ వ్యవస్థాపకులు శ్రీయుతులు సత్యనారాయణగారు, రామన్న, లక్ష్మన్న.

ఏ ప్రలోభాలకు సాహిత్య సందర్భంగా చలించని చిరమిత్రులు, కవిత్వ జిజ్ఞాసువు శ్రీరమణగారంటే నాకిష్టం. ఆయన మాటమీద నాకు గురి. నా ఇతివృత్తాన్ని ఆయన కూడా ఆమోదించడం నాకు బలాన్నిచ్చింది.

రెంటాల కల్పన, మిత్రుడు అఫ్సర్, ఎ.వి.ఎఫ్. కో-ఆర్డినేటర్ శ్రీ జి.బి. రామకృష్ణశాస్త్రి ఎంతో సహకరించారు.

ఈ సంకలనంలో తమ / తమవారి రచనల అనుమతి కోసం కోరగానే ప్రచురణ కంగీకరించిన రచయితలకు, వారి వారసులకు, రచయిత్రులకు పేరుపేరునా కృతజ్ఞతలు.

సికిందరాబాద్

27-9-98

**ఇంద్రగంటి శ్రీకాంతశర్మ**

# కవితా! ఓ కవితా!

కవితా! ఓ కవితా!
నా యువకాశల నవపేశల సుమగీతావరణంలో,
నినునే నొక సుముహూర్తంలో
అతిసుందర సుస్యందన మందున
దూరంగా వినువీథుల్లో విహరించే
అందని అందానివిగా

భాసించిన రోజులలో,
నీకై ప్రయాసే ఒక తపస్సై
వెనుకాడే నిమిషలందియు నిషేలించిన,
ఎటు నే చూచిన ఎటులాలంక ఎన్ని
మెటుమాయల నటనంలో
నీ యాగం వినరానందమున,
నా గుహలో, కుటిలో, ఏకటిలో
ఒక్కడనై ప్రముక్తున రోజులు లేవా!

నీ ప్రాబల్యంలో
చిరదీక్షాతపస్సమీక్షణలో,
నిశ్చల సమాధిలో,
స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన నా
మస్తిష్కంలో
ఏయే ఘోషలు, భాషలు, దృశ్యాల్ తోచాయో?
నేనేయే చిత్ర విచిత్ర శ్యామంత
రోచిర్నివహం చూశానో!
నా గీతం ఏయే శక్తులలో
ప్రాణస్పందన పొందిందో?
నీకై నేనేరిన వేయే ధ్వనులో,
ఏయే మూలల వెదకిన ప్రోవుల
ప్రోవుల రణన్నినాదాలో!
నడిరే యాకస మావర్తించిన,
మేఘాలావర్షించిన,
ప్రచండ ఝంఝూప్రభంజనం
గజగజ లాడించిన
నడిసంద్రపు కెరటాల్లో మ్రోగిన

శంఖారావం ఘంటాధ్వానం!
ఆ రాత్రే,
కారడవులలో లయాతీతమై
విరుతించిన నానాజంతుధ్వనులలో?
నక్షత్రాంతర్నిబిడ నిఖిలగానం,
భూకంపాలు, ప్రభుత్వ పతనాలు,
విప్లవం, యుద్ధం,
అన్నీ నీ చైతన్యం!
నీ విశ్వరూప సాక్షాత్కారం!

మరి నిన్ను స్మరిస్తే
నా కనుపించే దృశ్యాలా?
వినిపించే భాష్యాలా?

అగ్ని సరస్సున వికసించిన వజ్రం!
ఎగిరే లోహశ్యేనం!
ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగ నాదం!
ఇంకా నే నేం విన్నానా?
నడిరే నిద్దురలో
అపుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని
రుచిర స్వప్నాలను కాంచే
జవరాలి మనఃప్రపంచపు టావర్తాలు!
శిశువు చిత్ర నిద్రలో
ప్రాచీన స్మృతు లూచే చప్పుడు!
వైద్యశాలలో,
శస్త్రకారుని మహేంద్రజాలంలో,
చావుబ్రతుకుల సంధ్యాకాలంలో

కన్నులు మూసిన రోగార్తుని
రక్తనాళ సంస్పందన!
కాలువ నీళులలో జారిపడి
కదలగనైనా చాలని
త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన!
ప్రేలాపన!
కడుపు దహించుకుపోయే
పడుపుకత్తె రాక్షసరతిలో
అర్ధనిమీలిత నేత్రాల
భయంకర బాధల పాటల పల్లవి!
ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం!
ఉన్మాది మనస్సినీవాలిలో
ఘూకంకేకా, భేకంబాకా!
సమ్మెకట్టిన కూలీల,
సమ్మెకట్టిన కూలీల భార్యల, బిడ్డల
ఆకటి చీకటిచిచ్చుల
హాహాకారం!ఆర్తారావం!
ఒక లక్ష నక్షత్రాల మాటలు,
ఒక కోటి జలపాతాల పాటలు,
శతకోటి సముద్రతరంగాల మ్రోతలు!
విన్నా నమ్మా! విన్నా, నెన్నో విన్నాను.

నా విన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే--
అవి,

పుంఖానుపుంఖంగా

శ్మశానాల వంటి నిఘంటువుల దాటి,
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి,
ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి-
వడిగా, వడివడిగా
వెలువడ్డినై, పరుగిడ్డినై, నా యెద నడుగిడ్డినై!
ఆ చెలరేగిన కలగాపులగపు
విలయావర్తపు
బలవత్ ఝురవత్ పరివర్తనలో,
నే నేయే వీథులలో
చంక్రమణం చేశానో,
నా సృష్టించిన గానంలో
ప్రక్షాళిత మామక పాప పరంపర
లానందవశంవదహృదయుని జేస్తే-
నీకై మేలుకొనిన
సకలేంద్రియములతో
ఏది రచిస్తున్నానో, చూస్తున్నానో,
ఊపిరి తీస్తున్నానో
నిర్వికల్ప సమాధిలో
నా ప్రాణం నిర్వాణం పొందిందో,
అటు నను మంత్రించిన,
సమ్ముగ్ధం గావించిన ఆ గాంధర్వానికి,
తారానివహపు ప్రేమసమాగమంలో
జన్మించిన సంగీతానికి....
నా నాడుల తీగలపై సాగిన
నాదబ్రహ్మపు పరిచుంబనలో,
ప్రాణావసానవేళాజనితం,
నానాగానామానస్వానావళితం,

బ్రదుకును ప్రచండ భేరుండ గరు
త్పరిరంభంలో పట్టిన గానం,
సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతం,
అమోఘ, మగాధ, మచింత్య, మమేయం,
ఏకాంతం, ఏకైకం,
క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం,
బ్రహ్మానుభవం కలిగించిన,
నను కరిగించిన కవనఘృణీ!
రమణీ!
కవితా! ఓ కవితా!
నా జనని గర్భంలో,
ఆకారం లేకుండా నిద్రిస్తున్న
నా అహంకారానికి
ఆకలి గొల్పించిన నాడో!
నా బహిరంతరింద్రియాలలో
ప్రాణం ప్రసరించగ, నే నీ భూలోకంలో పడి
సుఖదుఃఖా లేవేవో
వస్తూంటే తలదాలిచి
ప్రపంచ పరిణాహంలో
ప్రయాణికుడనై,
పరివ్రాజకుడనై,
విహ్వాలంగా వర్తించేవేళ
అభయ హస్తముద్రతో నను దరిసిన,
నన్ను పునీతుని కావించిన కవితా!
లలిత లలిత కరుణామహితా!
అనుపమితా!
అపరిమితా!

కవితా! ఓ కవితా!
నేడో, నా ఊహాంచల
సాహసికాంసం కప్పిన నా
నిట్టూర్పులు వినిపిస్తాయా?
నేనేదో విరచిస్తానని,
నా రచనలలో లోకం ప్రతిఫలించి,
నా తపస్సు ఫలించి,
నా గీతం గుండెల్లో ఘూర్ణిల్లగ
నా జాతి జనులు పాడుకొనే
మంత్రంగా ప్రయోగించాలని,
నా ఆకాశాలను
లోకానికి చేరువగా
నా ఆదర్శాలను
సోదరులంతా పంచుకొనే
వెలుగుల రవ్వల జడిగా,
అందీ అందకపోయే
నీ చేలాంచలముల విసురుల
నా నుడి నీ గుడిగా,
నా గీతం నైవేద్యంగా, హృద్యంగా,
అర్పిస్తానో
నా విసరిన రస విస్ఫుమర
కుసుమ పరాగం
ఓహో! ఓ రసధుని! మణిఖని! జననీ! ఓ కవితా!
కవితా! కవితా! ఓ కవితా!

- శ్రీశ్రీ

# మలుపు బాజు

వెనుక
పాటలకారు గనుక
మా కంఠము మరి మరి
మకరంద ఝరి
మధుకర వన ప్రియ మధుర గీతికా లహరి!

పిమ్మట
కష్టకాలపు వేసగి చెమ్మట
తరువాత
మరి లేనెలేదు వరువాత
అహోరాత్రు లదేపనిగ

వానకారు వలపోత
బ్రతుకుటింటి యింటిపైన కారు మొయిలు
మసిపూత!
అయినప్పుడు:
మా కంఠము ఒకొకప్పుడు
చలిపిడుగుల చప్పుడు
చలజ్జ్వలచ్చంచల అపుడప్పుడు

కానరాదు నేడు ఋతువుకు ఋతువుకు నడుమ నేల
కనుకనే లేదు నారాయణబాబులకున్ను శరద్వేళ!

వచ్చిపడెను ఒక్కసారి
మౌనమృత్యు ప్రతీహారి
మోడు సీతువు
పాడు తీతువు
కంఠ మిప్పుడు చీకురాయి!
పాడు నూయి!

అయితే నేడు కవితాకామినికే
వచ్చింది ఖాయిలా
అసలు గూటిలో నుంచే అదృశ్యమైందా
కోయిల
కల్పనకిది కాని రోజు
కవి కంఠంలో పట్టింది బూజు
కలదింకా నీకొక రోజు దులుపు బూజు!

- శ్రీరంగం నారాయణబాబు

## భిక్షుకి

పుడమియంత పుష్యమాస
రాత్రికాలిక
శీతమందణంగియుంది
శవము పోలిక;

కట్టి చినిగినట్టి పాత
గుడ్డపేలిక
నడుముచుంది వడకుచున్న
బీద బాలిక.

కను కనుమల కనలుచుంది
జఠర జ్వాలిక
నోరు విప్ప నుడువురాదు
ఉత్తనాలిక
కదలుచుంది కుష్టురోగి
వ్రేలిపోలిక
కలరు భాగ్యవంతులపుడు
హంసతూలిక
తల్పములశయించి, నిరసి
త ప్రణాళిక
విధము నుంది వ్యర్థజన్మ
బీదబాలిక
తుహిన మాలిక పయిన నుండి
పడినదపుడు ప్రకృతి బాష్ప
ధారపోలిక

నక్కపండ్ల నములబడ్డ
శవము చీలిక
పయిన పర్వు నుదయకాంతి
కనక జాలిక.

- ఏరాఖి

# పొద్దున్నుంచీ పొద్దాకా

పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి పిట్టల పాటల్లోనే, పొద్దున్నుంచీ పొద్దాకా సమస్త జనుల సంతోషాలు, సన్నని గొంతుల గీర యేడుపులు, సరస విరసపు సంగతులన్నీ పొంగి పారుతూ పగలవుతున్నవి.
పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి పిట్టల కూతల్లోనే కూయి కూయి మను కూతల్లోనే పొన్నంగి కూతల పల్లవులలో పారుటాకుల పాన్పుల నుంచి పూవుల రాణులు పుక్కిలించుతవి!
పొద్దున్నుంచీ పొద్దాకా పొన్నంగి కూయిల ఉయ్యాలలలో పండుటాకుల పవళింపులలో పూవుల రాణులు పొద్దు పుచ్చుతవి!
కొక్కొరోకో మని కోడి కూయగా ప్రొద్దున్నే అమ్మా రావే బడి పిల్లాళ్ళంతా లేస్తారు! ఊ! ఇదిగో! మరే! ఊ! ఊ! అని భార్యాభర్తలు లేస్తారు!
కొక్కొరోకో మని కోడి కూయగా ప్రొద్దున్నే కాఫీ కడుపులు కదల బారతవి! ప్రొద్దున్నుంచీ పొద్దాకా కోడి కూసినా కూయకపోయినా కోడి కూతలకు ముందరగానే పనివాళ్ళంతా పనికి పోతారు! పనివాళ్ళంతా పనిలో ఉంటారు!
కోడికూసినా కూయకపోయినా ఫ్యాక్టరీ గొంతుల కీచుకూతలు, చాకలి రేవుల ఈలల ఊతం వినవద్దన్నా వినబడుతుంటవి!

- శిష్ట్లా ఉమామహేశ్వరరావు

# లెండోయి

లెండోయి! లెండోయి! బ్రతికి లేవండోయి!
విగత ప్రాణుల్లార! మృతశరీరములార! ... ॥లెం॥
తెలిమించువాకల్లు,
మన ప్రాణ రేఖల్లు,
వీకమ్మై గగనాన
దూకివచ్చిన వవిగో! ... ॥లెం॥
విశ్వశ్మశానంపు భస్మరాసుల్లార!
'గోరీ'లలోని కంకాళ శిథిలములార! ... ॥లెం॥
పతిత జీవనులార! బానిస ప్రజలార!
గతిలేక పడియున్న కష్టజీవుల్లార!
మతిలేని జనులార! మృతశరీరములార! ... ॥లెం॥
కటిక చీకటిజేని కట్టడులలో జిక్కి
కొసరు ప్రాణాలతో కుందు ఖైదీలార!
విశ్వ కారాగార వీధిలో చెరవడ్డ,
విశ్వకార్మికులార! నిగళబద్ధుల్లార! ... ॥లెం॥

- తెన్నేటి సూరి

# వెనక ఆపద

పద ముందుకు, వెనక ఆపద
ముది కనులకు లేదు కౌముది
గదిలోపలి నలుపు మూగది
పద నేస్తం! వెనక ఆపద!

ధర పెంచిన పాటలాధర
వలపించే పసిడి త్రోవల
ఎదగాలికి రేగు పయ్యెద!
పద ముందుకు! వెనక ఆపద!

జగమంతా పచ్చిలంజగ
కలవారికి విప్పుకోకల
మనసెందుకు రోరి వేమన!
పద నేస్తం! వెనక ఆపద!

గతి తప్పిన జనం సంగతి
తలమాసిన తత్త్వవేత్తల
కలరేగిన వెర్రికేకల
పద నేస్తం! వెనక ఆపద!

కలకాలము పూరిపాకల
వెలలేనిది ఊరి కోవెల
మదికయినా కొంత నెమ్మది
పద నేస్తం! వెనక ఆపద!

తరలించకు బ్రతుకు జాతర
పరమాత్మకు విప్పి చెప్పర
కలికాలపు బ్రతుకు టాకలి
గతి తప్పిన జగతి సంగతి!

- అబ్బూరి వరద రాజేశ్వరరావు

# ఫిడేలు నాయుడు గారి వేళ్లు

నాయుడుగారూ!
మీ వ్రేళ్ళు
ఘనరాగ పంచకం!
మీ శరీర
మాకాశం!
మీ హస్తం
హరివిల్లు!
చిత్ర చిత్ర వర్ణాలు
శ్రీహరి వ్రేళ్ళు!
సృష్టి
శ్రుతిమయం
సగుణం నాదం
నిర్గుణ బ్రహ్మ
నిశ్శబ్దపు
నీలి నీలి
యంచులనే
మ్రోగించును
మీ వ్రేళ్ళు!
ఉక్కు తీగ
నొక్కరో
తారలనే
దాటించి
ధ్రువ నక్షత్రానికి

చలనం కలిగించి
పల్లెటూరి
శోభ తోడ
పలుకరించు
సూర్య చంద్ర
లోకాలే!
సూచించు
బ్రహ్మ హృదయమే
వెన్నెల బయలయి
కనిపిస్తుంది.
పంచమమే పడితే
గాయత్రి
ప్రత్యక్షం
ఉపనయన వేళ
చెవిలో
బ్రాహ్మణుడేదో
ఊదినట్లు!

ఆనందానికి
పరమావధి
మందరమే
అందుకుంటే
సంధ్యకు పూర్వం
దిన సంధిలోన
తెల్లని వెలుగేదో తోచి
గళమై పాడును
పిష్కాట్

వాయిస్తారు
బొందెకు
ఆత్మకు
ద్వంద్వ యుద్ధమే
పెడతారు
మానవత్వపు కుట్లు
చిటపట తెగిపోవగ

మీ చేతిని
జంత్రం కాదది
ఏదో మహామంత్రం
మీ వ్రేళ్ళు
బీజాక్షరాలు
కమానా? కాదు!
నరుని రథం
భారత యుద్ధం
శ్రీకృష్ణుని
చేతిని
కొరడా!

మీ వ్రేళ్ళు
పలికే వేళల
విశ్వరూపమే
వినిపిస్తుంది
కనిపిస్తుంది.

- శ్రీరంగం నారాయణబాబు

# జ్ఞాపకాలు

నా పేరు లీల
ఆ ఊరిగోల పడలేక నేను పొరుగూరొచ్చాను! అందాలవాడే
అడవిలో ముంచాడు : అందరిని తలచుకొని అల్లాడుచున్నాను.
ఏకాకినై నేను దూరాన ఉన్నాను దారిన పోయే అమ్మలక్కలు
జేరి ముండ్లచూపులు చూచి అడుగుతూ పోతారు.
ఏకాకినై నేను నడిజాము వరకూ మేలుకొని మృత్యువును
బతిమాలుకొన్నాను!
అమ్మమ్మ జ్ఞాపకం, అమ్మ జ్ఞాపకం, చెల్లెలు జ్ఞాపకం, నాన్న
జ్ఞాపకం, అన్నలే జ్ఞాపకం, తమ్ములే జ్ఞాపకం, అందరిలో నువ్వే
ఆఖరి జ్ఞాపకం! రావేల! రావేల రాత్రి వచ్చింది! మధురమౌ
మగవాడ నా ప్రేమ నిజమోయి!
ప్రాభాతమౌ వేళ జ్ఞాపకాలొచ్చాయి!
తలిచి తలిచీ నిన్ను జ్ఞాపకాలొచ్చాయి!
పవళింపు సమయాన జ్ఞాపకాలొచ్చాయి!
తలనొప్పి తీర్చుతూ తలగడగ రావోయి!
చలికాల మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!
చైత్రమాస మొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!
వర్షాకాలమొచ్చింది జ్ఞాపకాలొచ్చాయి!

పిలుపులకు పలకనందులకై ఈ ఘడియ
ఈ క్షణము జ్ఞాపకాలొచ్చాయి! రావేల
మగవాడ! ఒడ్డూ పొడుగూవాడ!
ఏకాకినై నేను ఏదారిపోయినా పిలుపు పిలుపుకు పలికే
జ్ఞాపకాలొచ్చాయి! ఏకాకినై నే ఏమి పనిజేసినా తలపు తలపుకు
త్రవ్వి జ్ఞాపకాలొచ్చాయి! మరో పిల్లను నీవు మరులు
గొల్పావో, వేరో
పిల్లకు నీవు ఉరులు వేశావో, రావోయి రావోయి త్వర త్వరగ
రావోయి, నా కన్ను చెదిరింది పురుషులను జూస్తూ!
బుల బులల హోయికై కిల కిలల జోలకై పరితపించే మనస!
కన్నీళ్ళ హృదయమా! బుల బులల మన్నా కిల కిలల మన్నా
ముత్తైదు ముద్దు టుయ్యాలకే కద్దు!
బులు బులు బులు బులా హోయీా యీా! హోయమ్మ, నెవ్వరూ
పురిగొల్పి నావారు? పురిగొల్పినావాడు పురుషుడే కాడు! మగ
పిల్లవాడవో, ఆడపిల్లవో నీవు, మగవాడవై నీవు మాయదారి
వవకుండ, ఆడపిల్లవై నీవు అర్ధాన్న మవకుండ ఎన్నెమ్మయే
వచ్చి పురుడు పోసింది! కొత్తెమ్మయే వచ్చి ఉగ్గు కలిపింది!
పోతరాజే వచ్చి చేదవేశాడు! కొత్తెమ్మయే వచ్చి చాట పరచింది.
బులు బులు బులు బులా హోయీా, యీా! హోయమ్మ నెవ్వరో
చంకెత్తి కెళ్లారు! నా చన్నులో పాలు చేపుతున్నాయే!
ఉయ్యాలలో పిల్ల ఉబుసుల్లేవు! నా చన్నులో పాలు జున్ను
లెత్తాయే!
హోయమ్మ కెవ్వరూ హోయన్న వారూ! నీళాల సంద్రములో
నిప్పచ్చరము నేలపై రాయినై యాహల్య నైనాను శ్రీరామ
చంద్రమూర్తీ! రామ రామ నా పేరు లీల!

– శిష్ట్లా ఉమామహేశ్వరరావు

# భగవంతుడు

కీలుగుఱ్ఱము పైని
బాలీసు కానుకొని
ప్రాణాలు లేనట్టి
భగవంతు డొచ్చాడు
ఊరంత ఊరేగుతూ
ఉత్సవము సారించుతూ
కూలిమాటడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా!
కంచుగుండెకు గూడ
కనికరము గలదన్న
మాయవేదాంతాల
మాటేదో సూదారి
జాలిగిలబడి మ్రొక్కరా
వినకుంటె
చెవిటి మొద్దని వీడరా
ముక్కోటి దేవతలు
మూర్తుల్లు కంపిల్ల
కోటి చేతులు చాచి
గగ్గోలుగా లేచి
కూలిమాటడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా!

- తెన్నేటి సూరి

# మానవుడా!

రాశిచక్రగతులలో
రాత్రిందివాల పరిణామాలలో,
బ్రహ్మాండగోళాల పరిభ్రమణాలలో,
కల్పాంతాలకు పూర్వం కదలిక పొందిన
పరమాణువు సంకల్పంలో
ప్రభవం పొందినవాడా!
మానవుడా! మానవుడా!

సౌందర్యం ఆరాధించేవాడా!
కవితలో, శిల్పంలో - పురుగులో, పుష్పంలో -
మెరుపులో, మేఘంలో
సౌందర్యం ఆరాధించేవాడా!

జీవించేవాడా!
సుఖించేవాడా! దుఃఖించేవాడా!
విహ్వలుడా! వీరుడా!
ప్రేమించేవాడా!
వియోగీ! యోగీ! భోగీ! త్యాగీ!

అలోచనలు పోయేవాడా!
అనునిత్యం అన్వేషించేవాడా!
చెట్టూ, చెరువూ
గట్టూ, పుట్టా
ఆకసంలో, సముద్రంలో
అన్వేషించేవాడా!
అశాంతుడా! పరాజయం ఎరుగనివాడా!
ఊర్ధ్వదృష్టీ! మహామహుడా!
మహాప్రయాణికుడా!
మానవుడా! మానవుడా!
కాట్లాడుకునేవాడా! ఓర్వలేనివాడా! సంకుచిత స్వభావుడా!
అయ్యో! మానవుడా!
ఓహో! మానవుడా!
ధర్మస్థాపనకు యుద్ధం చేసేవాడా!
అన్యాయం భరించలేనివాడా!
ఆదర్శజీవీ! మహాత్మా! మానవుడా!

ఆసియా, అమెరికా, యూరప్,
ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో,
సముద్ర ద్వీపాలలో,
ధ్రువప్రాంతాలలో
పట్టణాలలో, పల్లెలలో
ధనివో, దరిద్రుడవో,
వృద్ధుడవో, యువకుడవో,
తెల్లని, నల్లని, ఎర్రని, పచ్చని రంగో,
బలవంతుడవో, బలహీనుడవో
బ్రదికేవాడా! పాడేవాడా! మానవుడా! మానవుడా!

అవిభక్త కుటుంబీ!
ఏకరక్త బంధూ!
మానవుడా! మానవుడా!
అనేక భాషలు మాట్లాడేవాడా!
అనేక స్థలాలలో తిరిగేవాడా!
అనేక కాంతులు వెదజల్లేవాడా!
సహృదయా! సదయా!
సన్మార్గగామీ!

సముద్రాలు దాటేవాడా
ఎడారులు, పర్వతాలు గడచేవాడా!
ఆకాశాలను వెదికేవాడా!
నక్షత్రాలను శోధించేవాడా!
పిపాసీ! తపస్వీ!

వంతెనలు నిర్మించినవాడా!
వైద్యశాలలు, వస్తుప్రదర్శనశాలలు,
గ్రంథాగారాలు, పరిశ్రమాలయాలు,
ధూమశకటాలు, నౌకలు, విమానాలూ
నిర్మించినవాడా!
దూరదృష్టి, దూర శ్రవణ శక్తులు
సాధించినవాడా!
మానవుడా! మానవుడా!

రసైకజీవీ! కవీ! నటుడా! శిల్పాచార్యా!
గానకళాకోవిదుడా! వేదాంతీ!
విజ్ఞానధనీ! భావధునీ!

దుఃఖమయా! దయాళూ! పరదుఃఖాసహనశీలీ!
చీమను కూడా చంపడానికి
చేతులు రానివాడా!
బుద్ధమూర్తీ!
జీసస్!

సంఘపశూ! శ్రమైకజీవీ!
శరీరపరీవృతుడా!
ఘర్మవర్ష పయోధుడా!
రక్తకణ సమష్టి కుటుంబీ!
కష్టజీవీ! కార్మికుడా! మానవుడా!

కూలీ! మాలీ! రైతూ!
గుడిసెలలో బ్రతికేవాడా!
గంజినీళ్ళు తాగి కాలం గడిపేవాడా!
కడుపెడు సంతానం కలిగినవాడా!
ఆకలి కన్నూ! మానవుడా!

తిరగబడేవాడా! ప్రశ్నించేవాడా!
అన్యాయాలకు ఆహుతి కావడానికైనా
జంకనివాడా!
ఖైదీ!
రౌడీ!
ఖూనీకోర్!
బేబీ!
మానవుడా! మానవుడా!

– శ్రీశ్రీ

# కయిత నా దయిత

కయిత
నా దయిత;
మన్మనోహారిణి
భావాంబర విహారిణి,
నా బ్రతుకు మబ్బులో విద్యుల్లత,
నా మోడు జీవితములో ప్రఫుల్లత
నా రక్తమున తీవ్రత
జీవన దేవత
నా రాణి

వాణి

నా కర్ణముల విశ్వగోపన
రహస్య గీతాల నాలాపన
సలుపునట్టి అమృతభాషిణి,
అంతరంగ నవోద్దీపిత
రక్తకామనా నిరూపిత
రమణీయ విచిత్ర వేషిణి
మర్త్యలోక స్వప్నరాజిత
రత్నఖచిత రథపు ప్రాజిత,
స్వర్గమునకు మార్గదర్శిని
కవిత్వ ప్రతీప దర్శిని

నాకు నీ రూపము చరాచర
వస్తువుల నంతట గోచర
మగు చుండుట కనుల పండువ
చంచల వననిధి యురంబున
సస్యజగతి నత శిరంబున
అలరుచున్నది నీ కండువ
కన్పించును కాననవాటిక
పరువబడిన నీ సుమశాటిక
అకుంఠిత పరిపూర్ణ రూపసి!
ఓ నాదు కవితా ప్రేయసి!

నా యదృష్టపున్ మహత్తున
ఈ సుందరమగు జగత్తున
నీ కంఠరవమ్ము విందును
నిశ్శబ్ద శరత్ నిశీధిని

హర్షపులకిత హృదివీధిని
శ్రావణ జలదంబు లందును,
నవ సుమముల నవుల సంతల
పొరుటాకుల నలవంతల
-కూర్చగ వీనులకు విందును-
నీ కంఠరవమ్ము విందును.

కాంచినాడను నీ నవ్వుల
జల్లు కురియుట, దవు దవ్వుల,
నీ రూపు విభ్రమ రేఖల
కనజాలుదు పువ్వు గుత్తుల
కనకకాంతుల, విద్యుత్తుల
ఇక్షువుల సుధామయూఖల:
నీ కన్నుల తళుకు మింటిని
శోభిల్లుచునుంట కంటిని,
సుస్వప్నఘటితా కారిణి!
ఓ నా సఖి! భవతారిణి!

వివశంబయి పోవగా, యిల
కుహూయంచు కూయు కోయిల
వినిపించును భవత్ కీర్తిని
పూర్ణిమామనోజ్ఞ యామిని
యవ్వనమదమత్త కామిని
బింబించును భవన్మూర్తిని;
రాగవంతమగు నుషస్సుల
కోకనద లసత్ సరస్సుల
యువక చిత్తములన్ వ్యక్తము

నీ సుధా ధరంపు రక్తము
దిగ్దిగంతములం జూడ్కిని
ప్రసరించి చంద్రికల మాడ్కిని
జగత్తున గల ప్రతి వస్తువు
నుం దాకుచు వింత యందము
నిత్య నూతనమగు చందము
అక్షరమ్ముగ నువ్విస్తువు! -
ధరణి, నీయమృతపు స్పర్శన
సలుప చిత్రముల ప్రదర్శన;
అద్భుతమగు ఐంద్రిక
ఓనా కవనంపు బాలిక!
పలు రూపముల ప్రత్యక్షము
నీ రూపము నా సమక్షము-
ఓసి చంచల సంచారిణీ!
ఓ మామకమౌ నితంబిని!
గ్రీష్మకాలపు కాదంబిని
లాగ వివిధ రూపధారిణీ!
కానీ, క్షణముండి ముంగల
మాయమ్మగు, కనకపుం గల
లాగా భవదీయ రూపము
హా! నాకు దురంత తాపము

నీ విట్టుల విడచిపోవగ
అతి దుర్భరమగును నా వగ;
చీకట్లిల నవతరించును
రసహీనమయిన వసుంధర
చీకాకయి మిగుల గందర

గోళంబుగ గోచరించును;
నీవుం గనబడని యుప్పుడు
చిటుకుమన్న చిన్ని చప్పుడు
నా గుండియనుం గలంచును
అంత శోకము ద్విగుణించును.

రమ్ము, రమ్ము పడిగధారిణి
నీ యధరపు మధుర వారుణి
నా వ్యధల పరిష్కరింపుము!
నీ యురమ్ము నాయురమ్మున
కానించి నీయంతరమ్మున
గల రహస్యముల వచింపుము!
బంధింపు, నను పరిరంభణ
మందు, ఏలనిక విలంబన?
సలుపుము నను సఖీ! తీయని
కంఠమ్మున ప్రియతమాయని

నా భాగ్య గగనములో శశి,
అపరూప అరూప ప్రేయసి!
నీ చూడ్కులతోడ తోరణ
కట్టుమ భువి, నీదులాస్యము
చేత నా విషాద దాస్యము
నింక సల్పుము పరిహారణ.
రమ్ము, రమ్ము ధరకు, శాంతిని
ఇమ్ము! విమల కరుణ కాంతిని
విరజిమ్ముము! జగతి సర్వము
నుంజేయుము నయనపర్వము

రమ్మి, రమ్మి రమ్మి భూమిని
వేచియుంటిని, రయగామిని!
విరహానలదగ్ధ చిత్తుడ
హతభాగ్యుడ, నీదు చేరిక
నిచ్చలుండ నిప్పుకోరిక
వలన, నే కడు నున్మత్తుడ.
వినుపింపగ నీదు కోయిల
సుస్వనంబుల, రమ్మి, యిల!
ఓ మనస్వినీ! అనిందిత
రూపిణీ! జగద్వందిత!

నా బాధల నుపశమింపగ
నా చిత్తమున సుధనింపగ
చుంబింపుము నాదు మోహిని,
ఏకాకిగ వసుధనుంటకు
దుస్సహ విరహంపు మంటకు
భీతిల్లిన కరుణజీవిని
నీదు హస్తము నిటు నాకయి
యందు నుంపును సఖీ! నీకయి
సలుపుచున్నవాడ తీక్షణ
భావమ్మున నే నిరీక్షణ

నీవు రావు వేచియుండిన
కనుక; పువుతావులు నిండిన
పున్నమ నిసలందు; చిక్కని
రసాల కిసాల నికుంజము
లందు సరసిజదళ పుంజము

లందు, సరసులందు, చక్కని
తీరములందు, భూమ్యాకాశము
లందు సుందరి! నీ కోసము
అనంతముగ నా పరిశోధన
అది జన్మ జన్మాల సాధన

కవితయగును దివ్యమోహిని
ఏనాటికి కాదు గేహిని
నిత్యమ్ము దాగుడుమూతల
నాడును మాదు ప్రణయంబులు
విరహమున పునర్మిలనంబులు
మధురతరంబగును, భూతల
రంగమందున సౌదామిని
కరణి రగులు కవనభామిని
కవుగిలి, అనంత పరిశోధన
అది జన్మ జన్మాల సాధన

వాణి
నా రాణి
ప్రణయశాలిని
భావనా రాజ్యపాలిని
మనోజ్ఞ చిరయవ్వన విలాసిని
నేను ప్రేమించు నందనవనీవాసిని
నా జీవితమునకుందరి
అరూప సుందరి
నా దయిత
కయిత.

- ప్రతిభ

# చెరకాలము

నిరుడు విరిసిన నీలగగనం
నేడు కనపడదమ్మా
నిరుడు విసరిన శీతవాయువు

నేడు మసలదు తల్లీ!
నీలిరెక్కల కాలవిహాగం
నీడ జిక్కితి తల్లీ!
జాలికన్నుల కారుచీకటి
మ్రోల నిలిచితినమ్మా!

ఖంగుమన్నవి మృత్యుదేవత
కాలి యందెలు తల్లీ!
చరమ రాత్రించరుల సన్నిధి
జలదరించితి నమ్మా!

కలల బ్రతుకున గాలిమేడలు
కరిగిపోయిన వమ్మా!
వెలితి కన్నుల వెలుగు కోసము
వెదకి కొందును తల్లీ!

స్వేచ్ఛ కోరిన పేదరక్తం
వెల్లబారిన దమ్మా
జనసమరమున పరాజితుడను
సెలవొసంగుము తల్లీ!

ద్వేషబుద్ధిని ధిక్కరిస్తే
దోషమెవరిది తల్లీ!
తీరులేనిది నేటి లోకము
నేర మెవ్వరి దమ్మా?

\- అబ్బూరి వరద రాజేశ్వరరావు

# దివ్య సంధ్య

అప్పుడే ప్రభవించిన శిశువు చూడలేదు
వెలుతురు.
ఎప్పుడో కట్టేసుకున్న ముసుగు చూడలేదు
వెలుతురు.
జీవన సంగ్రామ రంగంలో సంఘటితమౌతున్న శక్తులు
తెంపుకొన్న సంకెళ్లనే ఆయుధాలు చేసుకొని
సజీవ స్వప్నాల కోసం సాగినప్పుడెంతకాంతి?
ఎంత కాంతి!

నీ చుట్టూ దింపుకొన్న నిరాశ పరదాలను
నిశితమైన నా కళ్ళ భూతద్దాల నుండి కేంద్రీకృతమైన
నిరంజన ఆశాఉ తపం తగలబెట్టిన తరువాత
నీవు చూడగలుగుతావు నా వెలుతురు.
కోటి శ్రమజీవుల కూటమిలో
వెలుతురు.
సాటి నడిమి తరగతివాళ్ల నయనాల్లో
వెలుతురు.
మిత్రుడా! శాశ్వతంగా మోసపోయానంటున్నావు
శత్రువుని తీసుకొచ్చి నీ ముందు బంధించాను
నీ నిట్టూర్పులతో వీడి కట్లు తెంపకు
నీ చేతకానితనంతో వీడికి జవసత్వాలివ్వకు.
కావిరి నిండిన కళ్ళ కటకటాలు తెరచి చూడు
కనుచూపులు ఖడ్గాలు చేసుకో
వీణ్ణి ఈ మోసగాణ్ణి అహింసతో క్షమించకు
పుడమి తల్లి పురుటాలు

వీడేమో ఆమె జవనాలు తన జలాషా కోసం
నొక్కుతాడు; స్తన్యం మనకు
దక్కనీడు; ఏ పుణ్యం మనకు
దక్కనీడు ఈ మొక్కలీడు.
వీడు పుంభావ పూతన
వీడి నిజస్వరూపం తెలిస్తే
మనలో ప్రతి ఒక్కడూ బాలకృష్ణుడు!
ఏ పల్లెనా రేపల్లే!
అందులోని పాలు పెరుగులు మనవి
అందులోని వెన్న మీగడలు మనవి.
చిలుకుతున్న పాల కడవలో
వెలుతురు.
పెరుగుతున్న రేపటి శిశువు బోసినవ్వులో
వెలుతురు.
వీర్యవంతుల ధైర్యంలాగ
దేదీప్యమానమైన వెలుతురు దుప్పటిపై
రాత్రి కన్య ఉత్సంగ మధ్యాన
రేత్ర వర్షాలు కురుస్తున్న దివ్యసంధ్య
కేరింతల వలయాల వెనుక
కిరణ్మయి వక్షోజాలపై
నక్షత్రాలు ప్రతిఫలిస్తున్నాయి చూడు!
నేను ఊహిస్తున్న, ఆహ్వానిస్తున్న,
మనిషి పుట్టుకతోనే సర్వస్వతంత్రుడు
అతని కన్నుల వెనుక ఉదయభాస్కరాన్ని
ఎప్పుడూ, ఎన్నడూ,
ఎవ్వరూ, అపహరించలేరు.

- ఆరుద్ర

# కాలం తీరు

చిత్రంగా వుంటుంది కాలం తీరు
చైత్ర నవపల్లవరాజి చిగిర్చిన నాటినుండి
శిశిరంలో ఆకురాలి చెట్టు మోడైన దాక
జీవితానికి ప్రతిబింబంగా
కనిపిస్తుంది కాలం!

ఆద్యంత రహితమైన అవిచ్ఛిన్న వలయమూర్తి
కాలం - ఒక మొదలు ఒక తుది మధ్య
కదలాడు తున్నట్లుంటుంది
ఉదయాస్తమయాలవంటి
జనన మరణ సంధ్యల చివళ్ళకు
అంటుకుని పరిమితమైనట్లు
కంటికి కనిపిస్తుంది కాలం!

లేజిగురు పెదవులమీద రేగిన ఎరుపు చిరునవ్వుతో
ఒయ్యార మొలకబోస్తుంది
వసంతం పసికూనలాగ

ఆవిర్భవించిన అందం చూసి మైమరచిన మాతృమూర్తిలా
మనసులో ఊయలలూగుతూ
పరవశమవుతుంది ప్రకృతి
తెలిసీ తెలియని బాల్యంలో అహం గ్రీష్మంలా ఫీంకరించి

మేష రాశి గత రవిలా
ఉచ్ఛదశ చేరుతుం దల్లరి
ఆటలు మరిగిన బ్రతుకు
అసలే బడి మానేస్తుంది
నలుగురి నోళ్ళలో నలిగి నాలుగు చీవాట్లు తింటుంది

సారవంతమైన మనో భూములతో
చదువుల వర్షం కురిసి
లోకజ్ఞాన బీజరాశి చాళ్ళలో
నిలద్రొక్కుకుని పెరిగి
సాగే ఆగామి యాత్రకు
సాధనాలు సమకూర్చుకుంటున్నట్లు
జీవితం చెరువులు నిండుతుంది
పుష్కలంగా పండుతుంది

చల్లని వెల్లువై తెల్లని
శరజ్జ్యోత్స్న విచ్చేసినట్లు
క్రొత్తగా వచ్చిన పత్ని
కోర్కెల తీగ లల్లుతుంది
స్థిరమయిన ఉద్యోగ వసతి
జీవికకు హామీ ఇస్తుంది
రోజూ బ్రతుకు సాగుతుందిక
ఋజు మార్గ రేఖలో నని

అంతటితో కొంచెం చలి మొదలై
పులిలా గాండ్రిస్తుంది బ్రతుకు
ఎక్కడ చూసినా నిండిన

హిమబిందు సహస్రంలా
యాతనలు పాతుకుపోతాయి!
కురుస్తుంది కష్టాల చలి
కరిగిపోతున్న తెల్లటి మంచు
కాల స్వరూపం సూచిస్తుంది

ముసలితనం ముంచుకొస్తుంది తెంపులేని దిగుళ్ళతో
ఆ నాటి నును లేత చివుళ్ళు
ఆకులయి ఎండి రాలి పోతాయి
చెట్ల పంగల తొ(ర్రలతో భయంకరంగా
నిటారుగా నుంచున్న బతుకు
హఠాత్తుగా కూలిపోతుంది

చిత్రంగా వుంటుంది కాలం తీరు
రంగుల రాట్నం మీద గుర్రపు స్వారీలాగ
క్షణిక సుఖ భ్రాంతమైన జీవిత వార్ధి అంచులమీద
తెప్పగా తేలిపోతుంటుంది
ఆద్యంతాలు లేని అవిచ్ఛిన్న వలయ సుందర విలయమూర్తి
వలయ మార్గ చలనంలో
క్షణక్షణ వైవిధ్య సూచకంగా
విధి వ్రాతలో దాగిన అర్థాల కనుగుణంగా
విహరిస్తుంది కాలం!
సుఖ దుఃఖ చక్రాల సుందర రథమెక్కి
జీవితపు చీకటి చివరి సందులలోకి
వెలుగు రవ్వలు విసిరివేస్తూ విహరిస్తుంది కాలం!

- కుందుర్తి

# మేగ్నకార్టా

మేం మనుష్యులం
మేం మహస్సులం
గుండె లోపలి గుండె కదలించి
తీగ లోపలి తీగ సవరించి
పాట పాటకి లేచు కెరటంలాగ
మాట మాటకి మోగు కిన్నెరలాగ
మేం ఆడుతాం
మేం పాడుతాం

మేం ఉపాసకులం
మేం పిపాసువులం
భూమి అంచులకు వెలుగు తెరకట్టి
తారకల గతికొక్క శ్రుతిపెట్టి
పాట పాటకి వెండిదారంలాగ
మాటమాటకి మండు దూరంలాగ

మేం సాగుతాం
మేం రేగుతాం
మేం నవీనులం
మేం భావుకులం
పాత లోకపు గుండెలో శతఘ్ని పగిలించి
భావికాలపు చంద్రకాంత శిలల కరగించి
పాటపాటకి సోకు స్వర్గంలాగ
మాట మాటకి దూకు సింహంలాగ
మేం నిలుస్తాం
మేం పిలుస్తాం

మేం మనుష్యులం
మేం మహస్సులం
మాకు దాస్యం లేదు
మాకు శాస్త్రం లేదు
మాకులోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురు తురాయి
మేం పరపీడన సహించం
మేం దివ్యత్వం నటించం

గాలి గుర్రపు జూలు విదిలించి
పూలవర్షం భువిని కురిపించి
పాట పాటకు పొంగు మున్నీరులా
మాట మాటకి జారు కన్నీరులా
మేం ఆడుతాం
మేం పాడుతాం

– బాలగంగాధర తిలక్

# పచ్చిగ ఈ నేలంతా

పచ్చిగ ఈ నేలంతా
ప్రాణ ముబుకుతోందేమిటి?

కార్చిచ్చులలో మండిన,
కడలి పొంగుతో నిండిన

ప్రాణ గోళమంతా ఈ
పసరు చిమ్ముతోందేమిటి?

నరచరిత్ర క్రిక్కిరిసిన
ప్రళయ సమర సంఘర్షణ

జారిన వీరుల రక్తం,
ఆరని వనితల దుఃఖం

ముంచెత్తిన ఈ గోళం
మొలకెత్తిందా ప్రాణం!

శతసహస్ర కాందిశీక
శరణార్థుల శోకయాత్ర,

వెంటాడిన దోపిడి
తోడేళ్ళ గుంపు హతమార్చిన

చల్లని ప్రాణాలు చిగురు
సాగిన వాగోళంలో!

కరువు దహించిన లోకం,
వ్యాధి జయించిన లోకం,

తనువు నిరంకుశులు వధిం
చిన సహించి, పగవహించి

బూడిదగా కాలి పున
ర్జన్మించిందా గోళం!

చెరలో మండే తలపులు
చేపని రొమ్ముల వలపులు,

అసంతృప్తులావేదన
అన్నార్తుల కన్నీరుా

పుడమి నావరించి బ్రతుకు
పుష్పిస్తోందా యేమిటి?

నేటి యుగంనిండా
పోటెత్తిన జన చైతన్యం

పూర్వుల తీరని కోర్కెలు,
పుట్టని పాపల ఆశలు

ప్రాణ సముజ్వల తేజం
పయనిస్తోందీ గోళం!

ప్రజలంతా పసికన్నుల
పాపలై మెరుస్తారేం?

కార్చిచ్చులలో మండిన,
కడలి పొంగుతో నిండిన

ప్రకృతి బాలింత పచ్చి
పాలగుండె లాగుందేం?

– అనిసెట్టి సుబ్బారావు

# మాతృదేవి

పల్లె జాతికి భాగ్యమైనా
తెల్లరాతి దివాణమైనా
మెట్టపంటకు మేటియైనా
ఆంధ్రదేశపు హృదయ కేంద్రం
... పల్లనాడు!

నేను పుట్టిన, నేను పెరిగిన
నన్ను పోషించేటి చల్లని
... తల్లి నాదీ! పల్లనాడు!

చల్లగాలికి ఒళ్ళు ఝల్లన
పచ్చిగడ్డిలో పరకలేరే
పిల్లలందరి మడమ లంటుచు
కదిలిపోతుంటా!
... నే కరిగి పోతుంటా!

పంటచేలో మంచె పైనా
పరిగపిట్టల పారద్రోలే
కాపుకన్నెల వలపు కులుకుల
తళుకు చూపుల
కొరిగి పోతుంటా!
... నే మురిసి పోతుంటా!

గొర్రెమందలు కోడెదూడలు
పాడిగేదెలు ఆలమందలు,
తోపులందున కాపుగాచే
కొంటెపిల్లల వెంటనంటీ
ఆడుకొంటుంటా!

... నే పాడుకొంటుంటా!

పదం పాడే గ్రామ సీమల
పరుగులిడుతుంటా!

... నే పరవశతనుంటా!

చంద్రవంకల ఇంద్రకాంతిలొ
నాగులేటీ నాట్యకళలో
నాగ విజయుని శిల్పకల్పిత
బుద్ధస్తూపం సొగసువన్నెల
వెన్నెలలలో సోలిపోతుంటా!

... నే తేలిపోతుంటా!

నాగమాంబా నడుము ఖడ్గం
బ్రహ్మనాయని సింహనాదం
బాలచంద్రుని పచ్చి రక్తం
కనమదాసుని కత్తి పదును
తలచుకొంటుంటా!

... నే కలలు గంటుంటా!

మరపురాదీ సీమ పలనాటి సీమ!
మాసిపోదీ గాథ పలనాటి గాథ!!

– రెంటాల గోపాలకృష్ణ

## వాన తర

మబ్బా మబ్బా ఈమాట చెప్పూ
నీలోని ఈ నీరు ఏమూల కొచ్చేను,
నీ దూది కదలికల కే గమ్యముండేను?
మబ్బా మబ్బా, మరి బదులు చెప్పూ!

మబ్బా మబ్బా ఒక మాట వినిపో
రైతు కంటికి వత్తులేసుకుని చూసేను

కూలి వంటికి చెమట జలకమే మిగిలేను
కమిలి కుమిలిన నేలకొలి మెప్పుడారేను?
మబ్బా మబ్బా చెవినొగ్గి వినుకో-
నా మాట విని నడువ్ తూర్పుతీరం వైపు
కడలి నీటిని పీల్చి చదలంత పరచుకో
బూదిలా కమ్ముకుని భూమిపై కురిసిపో!

మేడపై పిడుగువై వూడి రాలిపడాలి
గుడిసెపై జల్లువై కరుణ చిలికించాలి
ఖామందు భూ-ఖైదుదారులను చరవాలి
గోచి పాతలవారి కొక కప్పుచూడాలి!
తుప్పొదిలిన పటాకత్తి తళతళలలో
కరుకుగోసిన కోత కొడవళ్ళు జళిపించి

క్రూర రాక్షసరాత్రి కంఠ రక్తములోన
కాలమే పులుగడిగినట్టే ముత్తెమవాలి!
ప్రళయమౌ వర్షాన వృక్షాలు కూలగా
పచ్చికలు తలయెత్తి పరవశం చెందాలి!
మిట్టపల్లాలొక్క సమతల మయేలాగ
కష్టకాలం గడిచి బతుకు ననలెత్తాలి!

మబ్బా మబ్బా చేతిలో చెయివెయ్!
మబ్బా మబ్బా కోరింది చేసెయ్!
విధ్వంసం వినిర్మాణానికి పునాది
విప్లవ మహావృష్టి పిదప నూతన సృష్టి!

- కె.వి. రమణారెడ్డి

# ప్రార్థన

దేవుడా
రక్షించు నా దేశాన్ని
పవిత్రులనుండి పతివ్రతలనుండి
పెద్ద మనుషులనుండి పెద్దపులులనుండి
నీతుల రెండు నాల్కలు సాచి బుసలుకొట్టే
నిర్హేతుక కృపా సర్పాలనుండి
లక్షలాది దేవుళ్ళనుండి వారి పూజారులనుండి
వారి వారి ప్రతినిధులనుండి
సిద్ధాంత కేసరులనుండి సిద్ధులనుండి
శ్రీ మన్మద్గురు పరంపరనుండి

దేవుడా
నలభైకోట్ల మనుష్యుల నిజమైన ప్రాణం వున్న
మనుష్యులతో నిండిన దేశం నాది
ఆకలీ బాధలూ ఆందోళనలూ సమస్యలూ
విరివిగా వున్న విచిత్ర సౌధం మాది
కడుపు నిండుగా ఆహారం గుండె నిండుగా ఆశ్లేషం

బ్రతుకు పొడుగునా స్వతంత్రం
కొంచెం పుణ్యం కించిత్ పాపం
కాస్త కన్నీరూ మరికాస్త సంతోషపు తేనీరూ
చాలు మాకు తండ్రీ
సరదాగా నిజాయితీగా జాలి జాలిగా
హాయి హాయిగా బ్రతుకుతాం
మాకు నటనలు వద్దు మా చుట్టూ కటకటాలు వద్దు
గొప్పలూ గోసాయి చిట్కాలు వద్దు

దేవుడా!
కత్తి వాదరకు తెగిన కంఠంలో హఠాత్తుగా
ఆగిపోయిన సంగీతాన్ని వినిపించు
మానవ చరిత్ర పుటలలో నెత్తురొలికి
మాసిపోయిన అక్షరాల్ని వివరించు
రహస్య సృష్టి సానువులనుండి జారిపడే
కాంతి జలపాతాన్ని చూపించు
మమ్మల్ని కనికరించు
చావు పుట్టుకలమధ్య సందేహం లాంటి
జీవితంలో నలువైపులా అంధకారం
మంచిగంధం లాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం
మజిలీ మజిలీకి అలిసిపోతున్నాం
మలుపు మలుపుకీ రాలిపోతున్నాం
ఆశల వెచ్చని పాన్పుమీద స్వప్నాల పుష్పాలు జల్లుకుని
ఆదమరిచి కాస్సేపు విశ్రమించడాని కనుమతించు తండ్రీ.

- బాలగంగాధర తిలక్

# ఖరార్‌నామా

జన్మెత్తిన మానవునకు
జీవితమే పరమధనం;

అయితే, అది ఒకమారే
అతని కొసగబడిన వరం.

పుట్టలోని పురుగులవలె,
పుట్టి పెరిగి,
సంఘంలో తావులేక,
అస్తిత్వ ప్రయోజనం
ఊహకు అందనిదవగా,
తన చరిత్ర చెరిపేసుక,
తనదారిని వెళిపోయే

మానవుడిక పుట్టబోడు;
సుడిగుండంలో పడి తిరగడు

ఎపుడో అజ్ఞాతయుగంలో,
నీపై కప్పబడిన దుప్పట్లే,
దుష్పలితాలై, దుర్భరమైనా,
తొలగించే శక్తిలేక,
మరణబాధతో గిల గిల
తన్నుకునేందుకు,
జన్మించావా? మనిషీ!

పిరికితనపు సిగ్గుల కగ్గలమై,
దగ్గపటలమై, పొగచూరిన
భూతకాల మర్యాదలు -
వ్రేలాడే బూజులు -
వేటాడే భూతాలై నిను తరుముతుంటె
పిరికిమందు తింటావా?
నరుడా!
వీరునివలె తిరుగుబాటు చేస్తావా?

ఉన్నదొక్క జీవితమే;
మానవునిగ, వీరునిగా
బ్రతుకుము నరుడా!
చరిత్ర నీ కోసం
ప్రసవబాధ పడుతున్నది!
భవిష్యత్తు నీ కోసం
పడిగాపులు పడుతున్నది!

అర్పించెయ్ నీ రక్తం మనిషీ!
నీ త్యాగం వృధా కాదు!
నీ త్యాగం వృధా కాదు!
ప్రయోజనం లేని
బరువుటేళ్లు మోసి మోసి
బడుగైపోయిన
దరిద్రమున కనలు బ్రతుకు!
గొలుసులోని కుక్క బ్రతుకు -
చాలు చాలు నరుడా! బ్రతుకలేవు.

ఉన్నది ఒక బ్రతుకే;
గతమును ఒక్కసారి విస్మరించు;
శూరుడవై శృంఖలముల ఛేదించు.

ప్రభవించే శాంతి జగతి
సువర్ణ దీధితి నీకే
ముమ్మాటికి నీ తమ్ములకే -
మనిషి! - నీరాజన మిస్తుంది.

పుట్టే నీ బిడ్డడు
దరిద్రమున, దోపిడిలో,
బ్రతుకడు; బ్రతుకలేడు.
ఏవో
ఆశల నిచ్చెనలను నిర్మించుక,
నిట్టూర్పుల వంతెన కట్టుక
స్వప్నాలోకనలో స్వర్గలోక
సౌఖ్యాలను తలపోస్తూ,

పుట్టే పాపా యిక
బ్రతుకలేదు; బ్రతుకడు.

స్వేచ్ఛ కొరకు జరిగే
విప్లవ సమరంలో
క్షతగాత్రుడవై పడిపోయిన మనిషీ!
గాయపడిన సింహంవలె
గర్జించిన నీ కంఠధ్వని
రాబోయే స్వర్ణయుగానికి జయభేరి!
నీ జీవితమొక రహదారి!

నవ సమాజ వ్యవస్థకే
బీజాక్షర నామకరణ మహోత్సవం!
నీ గొంతు కొసలు
దేశభక్తి నిర్వచనాలై
అహరహముగ నిలుస్తాయి;
జీవిత బలిదానం చేసిన మనిషీ!
నీ వచనాలే లోకపు
అంతిమ ఘడియల'వరకూ
ప్రతిధ్వనిస్తాయి!

రక్తం అర్పించుము నరుడా!
నీ త్యాగం వృథా కాదు;
నీ త్యాగం వృథాకాదు.

- సోమసుందర్

# ఎన్జీవో సూర్యుని వివాహం

దేవదుందుభులు మ్రోగలేదు
దేశం పండుగ చేసుకోలేదు
రాకపోకలు ఆగిపోలేదు
రహదారులు రమణీయంగా లేవు
పెళ్ళిపందిరి వేయలేదు
కళ్ళాపులు జల్లి రంగవల్లికలు పెట్టలేదు
మామిడాకులు కట్టలేదు
మనోజ్ఞమైన అలంకరణలు లేవు
రిజిస్ట్రార్ కచేరీలోనున్న
గుమాస్తాలు కన్నెత్తి కలం విడిచి చూడలేదు
మంత్రాల అనలవేదికముందు కాక
యంత్రాల అనిల వీచికలందు
ఎన్‌జీవో సూర్యుని వివాహం
ఎవరూ లక్ష్యపెట్టకుండా జరిగింది
సంతకాలు పెట్టిన సాక్షులు

సంతసించారో లేదో చెప్పలేము
ఫైలు కాగితాలమీద నవారు ముడివేసి
వాళ్ల జీవితాలు అధికారరీత్యా ముడివేసినట్లు
రిజిస్ట్రారు ప్రకటించినట్టుకూడా చెప్పలేము
గుమాస్తా చేయిచాచినట్టు మాత్రం చెప్పగలం
చూస్తున్నవాళ్ళ సంగతి కేంగాని
సూర్యుని సహధర్మ ఇహకర్మచారిణి గర్భంలో
రూపం ఏర్పరచుకొంటున్న పాప
లోపల లోపల ఉబ్బిపోయింది
తక్కిన ప్రపంచం మాటేమోగాని
దంపతుల గుండెల్లో ఎండ చల్లబడింది
వాళ్ల జీవితాలు మనోజ్ఞంగా ప్రేమ
వజ్రాలతో అలంకరించు కున్నాయి
మనస్సుల అనురాగ ద్వారబంధాల
మమతల మామిడాకులు వేళ్ళాడుతున్నాయి
కన్నీళ్ళు, తియ్యనివి, కళ్ళాపు జల్లి
కామనలు రంగవల్లికలు దిద్దాయి
విశాల హృదయాలు రెండూ ఒకటై
పెళ్ళిపందిరిలాగ వెలుగసాగాయి
వాళ్ళ రంగురంగుల కోరికల రహదారులు
వర్ణణీయంగా రమణీయంగా ఉన్నాయి
భవిష్యత్తు గురించి భయాల రాకపోకలు
ప్రస్తుతం మనసులో ఆగిపోయాయి
వాళ్ళకళ్ళకు దేశం పండుగ చేసుకున్నట్టుంది
వాళ్ళ చెవులలో దేవదుందుభులు మ్రోగాయి...

- ఆరుద్ర

# నగరంలో ఒక వాన దృశ్యం

నగరాల నాగరికత సులువుగా మరిగిన సూర్యదేవుడు
తెల్లవారి రేడియోలో తెలుగులో వార్తల చివర
వాతావరణం వింటేగాని ఒక పళాన నిద్ర లేవడు
భూమ్మీద పస్తులున్న మనుషుల్ని చూసి
ఆకాశం కంటతడి పెట్టినట్లు
వాన ముమ్మరంగా కురుస్తుంటే
ఉదయంనుండి సూర్యభగవానుడికి ఊపిరి సలపడం లేదు
రిక్షాలో కూచున్న ఘోషా సుందరిలా
ముఖానికి అడ్డం కట్టిన మొయిలు ముసుగులు తొలగించి
ఎన్నిసార్లు చూశాడో లోకం వేపు!
శతసహస్ర కిరణాల బాకులు ఝుళిపించే
చాకచక్యం తగ్గింది
ప్రాణాలు తీసే ప్రతాపం - పాపం
శీతలానికి తల వొగ్గింది
బ్రతుకులో సాధించదలచిన దానికి
పరిస్థితులు కలిసిరాని మానవమాత్రుడిలా
ఆ వేయి వెలుగుల దొర అగుపించడం లేదు
ఆయన రథం ఆగిందో నడుస్తోందో
ఆకాశానికే తెలీదు
ఉదయమే వేటాడటానికి ఉర్వీమీద మంచులేదు

మధ్యాహ్నం మండించడానికి మబ్బుల కంచుకోట పగలదు
పగలనే పేరు సార్థకమ్మై పతి ఒల్లని భార్యలాగా
ముఖాన తిలకమేనా లేకుండా
ముడుచుక్కూచుంది దివసం
ఉద్యోగం వూడిన కొత్తలో, భయంతో
కనబడినవాడి కాళ్ళమీదల్లా పడి
కాస్త సిఫార్సు చేయమని కోరినట్లు
ఏదో ఒక దేవుణ్ణి ఆశ్రయించడానికి
వెళ్ళివుంటాడు రవి
పిల్లకాయలు తియ్యగా తినే పిప్పరమెంటు బిళ్ళలా
ఏ మిట్టమధ్యాహ్న సమయానికో
ఉన్నాననిపిస్తాడు; కనిపిస్తాడు కష్టంమీద
అన్నం ముట్టని వ్రతంతో అంబరంవేపు
అడుగో యిడుగో అని
ముక్కుతూ మూలుగుతూ చూసే ముసలమ్మల కోసం.
మళ్ళీ సాయంత్రం అంతే -
మబ్బులతో నేసిన దుప్పట్లు
ఉన్నవాడు గనక పుష్కలంగా
పడమటి పొంత పడగ్గదిలోకి
మూడింటికే చేరి ముసుగు కప్పుకుంటాడు
నగరాల నాగరికత
నాలుగు కాండలు వెళ్లజదివిన
సూర్యుడు సోమరిగా తిరుగుతుంటే
పులిగా ముప్పూట ప్రతాపించి
చలి ఎముకలు కొరికేస్తుంది

- కుందుర్తి

# సారంగం

ఉదయించే రథసారథి
కరపల్లవ కాంచనమయ
కంకణరుచు లాకాశం
కమ్మి జగతి వ్యాపించెను!

వసుమతి వదనాంతరమున
ప్రభవించిన ప్రాణకాంతి
సూర్యకిరణ పరిష్వంగ
శోభ జగతి దీపించెను!

అగ్నికేతు వాకాశం
భగ్గుమనగ పైకి లేచి
దిక్కు-లన్ని దద్దరిలగ
గగ్గోలుగ తిరుగుతోంది!

రక్తధ్వజ లాంఛనాలు
శక్తి చేతి శస్త్రాలై
శత్రుమూక చెండాడుచు
క్షాత్రం చాటును నేడు!

సాగర కన్యలు రాగా
లాపన చేస్తూ మంగళ
నీరాజన మిస్తున్నారు!

వికసించిన సరోజాలు
విరజిమ్మెడు పరిమళాలు
వినువీధిని అతి విచిత్ర
గతి నృత్యం చేస్తున్నవి!

ప్రభాతభేరీ నాదం
ప్రజలకు వినిపిస్తున్నది!
భారత నారీ లోకం

తోరణములు కడుతున్నది!

పరుగులతో యువకులంత
భారత స్వేచ్ఛాగీతం
ప్రపంచశాంతి నినాదం
దుందుభి మ్రోగిస్తారు!

నవయువకుని హస్తాంచిత
పరిపూరిత భానుమూర్తి
ధనుర్జ్యా టంకారావం
గగనం కీర్తిస్తున్నది!

కార్మిక కర్షక లోకం
కాలానికి కట్టవేసి
క్షామబాధ తీర్చుతోంది
చరిత్రగతి మార్చుతోంది!

నవభారత రాజ్యం మేం
పవళించెడు పసిడిపాన్పు!
ఇది మా నిర్మాణంలో
సమధర్మం సాధనగా

అభయంగా నిలుస్తుంది!
విశ్వానికి విజయభేరి!
భువనానికి నవ్యకాంతి!
విభవోన్నతి! విమల కీర్తి!

– రెంటాల గోపాలకృష్ణ

# నువ్వు లేవు నీ పాట వుంది

నువ్వు లేవు నీ పాట వుంది; ఇంటిముందు జూకామల్లె తీగల్లో అల్లుకుని
లాంతరు సన్నని వెలుతురులో క్రమ్ముకుని నా గుండెల్లో చుట్టుకుని
గాలిలో ఆకాశంలో నక్షత్రం చివరి మెరుపులో దాక్కుని నీరవంగా
నిజంగా వుంది. జాలిగా హాయిగా వినపడుతూ వుంది. శిశిర వసంతాల
మధ్య వచ్చే మార్పుని గుర్తుకి తెస్తోంది. యిన్నేళ్ళ తర్వాత వేడిగాలి

చల్లదనానికి తిరిగే ఒకానొక గ్రీష్మ దివసావసాన సమయాన డాబామీద
సిగ్గిలిన సోగకళ్ళతో మల్లెపూల వాల్జడతో నువ్వు పాడిన పాట
నా గుండెల దగ్గర తడబడుతూ ఏదో కొత్త భాషలో చెప్పి
ఒక అందమైన రహస్యం విప్పి పరువానికి వస్తున్న నా వయసులో
చటుక్కున పరిమళపు తుపానుల్ని రేపి మహారణ్యాల సౌందర్యాన్ని
చూపి సముద్రపు కెరటాల బలంతో మధ్యగా మౌనంగా వున్న
ద్వీపాల్ని ఊపి
ప్రపంచం యొక్క అవధుల్ని దూరంగా చాచి నన్ను దిగంతాలకి
విసిరేసిన వేళ

ఇజాలూ రాజకీయాలు వాదాలూ హత్యలూ యుద్ధాలూ
ఇంకా యిటువంటి చెత్తా చెదారం మనస్సులో పేరుకోకముందు
పండిన మొగలి పొత్తివంటి పరిమళం గల ప్రారంభయౌవనపు నిండైన
ఆరోగ్యపు వాకిళ్లముందు విరిసిన నందివర్ధనం పువ్వుల మధ్య
నువ్వూ నేనూ కూర్చొని అలాగ ఒకర్నొకరు చూసుకుంటూ
ఆకాశానికీ భూమికీ మధ్య పడిన చిరుచీకటి పలకమీద
రేడియం అక్షరాల్ని వ్రాసుకుంటూ
కాలాన్ని కదలకుండా నిలబెట్టి కమ్మని ఊహల పూల తోటల మధ్య
పరుగులెత్తి సాహసపు మంచుకొండల అంచులమీద స్కేటింగ్ చేసి
అకలుషితమైన యౌవనోల్బణంతో బలంతో అమాయకత్వంతో
ఆకాశాల ఆశల మేలు చాందినీలు కట్టి
నీ నా సామీప్యమే స్వర్గంగాస్రవంతిగా జీవిత
పరమార్థంగా ఎంచి
నలుపు చారలు లేని తెల్లని సూర్యకాంతి పడిన పాలరాతి గచ్చులా
ప్రతిఫలించి
నీ వొడిలో నా తల పెట్టుకుని అభ్యంగనావిష్కృత త్వదీయ
వినీల శిరోజ తమస్సముద్రాలు పొంగి నీ బుజాలు దాటి నా

ముఖాన్ని కప్పి ఒక్కటే ఒక్క స్వప్నాన్ని కంటున్న వేళ
చంద్రికాస్నపిత సంగీతాన్ని వింటున్న వేళ

ఆకుపచ్చని భూమికీ గిరులకీ ఝరులకీ సమస్త సృష్టికీ
ఒకే అర్థం కనుక్కున్న వేళ
నీ పాట హాయిగా గాలిలో తేలి మునిమాపు జేగురులతో కలిసి
దిక్కులను చుట్టి నీ మృదు చలాంగుళిచ్ఛవిలో కరగి
నా వొంటిని నిమిరి నన్ను నిర్నిద్ర నిద్రలో పడవేసి నీ ఎర్రని
పెదాలు నా నొసటిమీద ఆనందపు నెలవంకల్ని చిత్రించి నన్ను
మంత్రించిన ఆరోజులింక
రావు యిపుడు నువ్వు లేవు నీ పాట వుంది నా లోపల లోపల
ఆరిన కుంపటిలో రగులుతున్న ఒకే ఒక స్మృత్యగ్ని కణంలాగ
క్రమక్రమ జరా రుజాగ్రస్తమైన వయస్సనే పాడింటి మూలగదిలో
కుండీలో యింకా వాడకుండా నిల్చిన పువ్వుల గుత్తిలాగా
గడుసుదనం మోసం పరువూ ప్రతిష్ఠలనే గాడిదలమీద
బ్రతుకు పాతబట్టల మూటల్ని వేసి తోలుతున్న వేళ
నా ఏడుపు నాకు తప్ప లోకానికి వినిపించని వేళ
నే కూరుకుపోతున్న చాతకానితనపు వానాకాలపు బురదమధ్య
నీ పాట ఒక్కటే నిజంలాగ నిర్మలమైన గాలిలాగ నిశ్శబ్ద నదీతీరాన్ని
పలకరించే శుక్తిగత మౌక్తికంలాగ
ఇంటిముందు జూకామల్లె తీగలో అల్లుకుని లాంతరు వెలుతుర్లో
క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకుని గాలిలో ఆకాశంలో
నక్షత్రం చివరి మెరుపులో దాక్కుని నీరవంగా నిజంగా వుంది
జాలిగా హాయిగా వినబడుతూ వుంది
శిశిర వసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పుని
గుర్తుకి తెస్తోంది యిన్నేళ్ళ తర్వాత

- బాలగంగాధర తిలక్

# అగ్ని స్పర్శ

**బా**ధాగ్ని కుసుమాన్ని ఆఘ్రాణిస్తున్నప్పుడే
క్షణాల మధ్య అగాధంలో స్వప్న చక్షువులకు నిషా
ఖడ్గ ధారల మధ్య క్షతగాత్రుడైనా అప్పుడు ఉజ్వలంగానే ఉంటాడు
వైరుధ్యాలను వెన్నెముకగా ధరించిన నేను
ఎడారిలో వానజల్లుల రహస్యాన్ని ఏనాడో మౌనంగా స్వీకరించాను

కాలం మరెవరో కాదు నేనే
క్షణ క్షణ సంహార క్రీడలో గతం, వర్తమానం,
ఉదయాస్తమయాలు
ఉన్మత్త క్షేత్రాలలో రాక్షసుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
జీవన కుడ్యాలపై ఆకలి ఆకర్ణాంత నేత్రాలు
కన్నీళ్లలో ప్రేమికుల ప్రతిబింబాలు
అన్నీ ఒకే దృశ్యం వెనుక చీకటి భస్మరాసులే!

కంటక చతురస్రాల మధ్య నిరీక్షణ అసహ్యం నాకు
నిరాశ, నిట్టూర్పులు, నిద్రారణ్యాలు నిషిద్ధం

ఆధునిక మానవుడు అనల నేత్రుడు కదా
హతుడు, హంతకుడు అతడే
క్షణ క్షణ బీభత్సాలు నా అలంకారం
ఎర్ర దీపాలే జీవన సామగ్రి

జీవన సంగ్రామంలో క్షణం ఆలస్యంగా అడుగుపెట్టిన నేను
చెట్ల ఆకులలో బీభత్సం చూశాను
మనిషి ఆలోచనలపై చీకటి అంగరక్షకుల పాషాణ హస్తాలు
చూశాను
నిషిద్ధాక్షరాల మధ్య నరబలి చూశాను
ఎర్రని గాయాలపై సూర్యకిరణాల చిత్రలిపి చూశాను

భయ విభ్రమాల మధ్య విషాద వాక్యం వలె సాగే జీవితంలో
మృత్యువు ఒక్కటే నిజం
హఠాత్తుగా తలుపు తెరుచుకోవడం మృత్యువు
నడుస్తున్న రోడ్డు మధ్యలో మటుమాయం కావడం మృత్యువు
శిరస్సు తెగిన దీపస్తంభం మృత్యువు
నగర ప్రాకారాల మధ్య ఫ్యాక్టరీల జిహ్వాగ్రాల నుంచి వెలువడే
నరవాసన మృత్యువు

మృత్యు గృహంలో నగ్నంగా నిలబడిన క్షతగాత్రుడిని నేనే
బాధ నా ముఖచిత్రం
బాధాగ్నిలో పునీతుడైన మనిషి పాదధూళిలో
మరణానంతరం నేను పాడే స్వేచ్ఛా గీతాన్ని రచిస్తాను
అప్పుడే నా అక్షరాలకు నిషా
అగ్నివృక్షం క్రింద రేపు నేను మరో మనిషిని.

- అజంతా

# టైఫాయిడ్ గీతం

ఆ కవాటం ఇక తెరవకు
కన్నెత్తి చూడను ఋషులను, కాపురుషులను
ఎడద ఎండిపోయింది ఇపుడు
ఎవరినీ కలవను
చంద్రుడు కనిపించని కలువను

ఎవరినీ పిలవను
ఇప్పుడు రాలిపడిపోతే మళ్ళీ మొలవను
అప్పుడెవడైనా తలుపు తట్టిన చప్పుడు విందామని
ఒళ్లంతా చెవులు చేసుకున్నాను
గుళ్ళో మోగిన గంటల చప్పుడు
గుండెల్లో నినదించినప్పుడు
ఎవరో పిలుస్తున్నారని
ఎంతో సంతోషించాను

ఆకు అల్లాడితే సరి ఎవరని పలకరించాను
రోడ్డుపై రిక్షా అలికిడి అయితే చాలు
నా కోసమే దూరదూరాల నుంచి
స్నేహసముద్రతీరాల నుంచి
ఎవరో వొచ్చారని లేచి
శయనీయం మీద కూర్చున్నాను

వీధిలో తలుపుతట్టిన ధ్వని వినిపిస్తుందా?
ఇటువైపున నా కోసం ఎవరైనా ఇకమీదట వస్తారా?
నాలుగు గోడల మధ్య బాష్పాళి నదిగా జాలువారింది
పరీభావం మనస్సులో బాధిస్తూ మిగిలింది
ఇపుడు నా మది మౌనమహతి
మరి పలకని ఘోషవతి
తెగేవరకూ దారం లాగి
ఆఖరి క్షణంలో చుట్టూ మూగి
అనునయ వాక్యాలు చెప్పటం
అదీ మనకు ఆచారం!
అప్పుడే మన మధ్య ఏర్పడింది శతయోజనాల దూరం

సమయానికి సంజీవి పడని రోగికి
సమయం దాటిన పిమ్మట
బళ్ళకొద్దీ గుళికలు సరఫరా
చేయకపోతేనేం? హరహరా!

నాటకాంతంలో ప్రేక్షక నిష్క్రమణం తరవాత
నేపథ్యంలో నటీమణి
నాట్యగాన పాండితీ ప్రకర్ష
అద్భుత భావ ప్రదర్శన చికీర్ష
ఎవరికోసం? ఎందుకోసం?

అందరూ విడనాడినా
అంతరిక్షంలో రిక్కలు మాత్రం
వీడు నిరుత్సాహపడ్తాడని
తోడుగా నిలబడ్డాయి
ఎదురుగా కదలక నిలుచున్న కొండ
ధైర్యం నూరిపోసి నన్ను పలకరించే అండ
ఉల్లాసంగా పెరిగిన చెట్లు ఊగుతూ పాడుతున్న
ఉత్సాహగీతం ఈ ఏకాకికి అమృతపాతం
జగదీశ వినిర్మిత క్ష్మాచక్ర భ్రమణవీతి
ననుకరించి తిరుగుతోంది నరనిర్మితమైన ఫాన్
ప్రకృతి ఇచ్చే ఆప్యాయం
కృతకజగతిలో మృగ్యం
ఇవాళ తెలిసింది జీవితం ఒంటరితనానికి మరోపేరని
నా బరువు నేనే మోసుకుంటూ నడవాలని

- గోపాల చక్రవర్తి

పాశ్చాత్య దేశాలలో
అప్పుడప్పుడూ ఉదయాన మ్రోగే
చర్చిగంట కాదుగాని --ఇది
ఎక్కడో ఏ దేశానవో
ఇన్నాళ్ళకు ఇన్నేళ్ళకు ఉదయం అయిందని
రహస్యంగా ---
భయం భయంగా
నాతో చెప్పడానికి
రెక్కలార్చుతూ వచ్చిన
ఉదయకాల ఘంటిక.
ఉదయాలెన్నో నశిస్తాయి;
ఉదయ సమయ సౌందర్యం చావదు.
మనం కష్టాలు పడి ఆర్జించిన
మందారం వంటి స్వాతంత్ర్యం
ఏ బాంబు పాదాల క్రిందనో
నలిగి అణగారిపోవచ్చు.
కానీ --''తమ్ముడూ!
స్వతంత్రతా సుందరత
ఉదయ భామినీ తరుణారుణ కపోల యుగళి
మెరసిన దివ్యకాంతివలె
శాశ్వతంగా బతుకుతుంది''
అంటుంది ఈ
ప్రత్యూష ఘంటిక!
ఈ ఘంటికా రహస్య రమ్యగీతం
మన భావవీణా తంత్రులకు అతీతం !

- దాశరథి

# స్ఫురణ

ఎప్పుడో ఒకప్పుడు, నేను వయసులో ఉన్నప్పుడు
ఎక్కడో ఒక కవిత చదివినట్లు గురుతు- అప్పుడు
భావం తెలియలేదు; కాని క్రమేణ గ్రహించాను;
పాటలోత్పల దళాల కాంతులు జారిన వేళ
నయన నీలిమలు కెంపిల జీరలు తేరిన వేళ
చలువరాతి నుదుటిపైన కలువ చెక్కిళుల రేకులు
తమస్వినీ నిశ్వాసాల, చల్లగ రాలే ఆకుల
గుసగుసలో పాపల పాలవాక కేరింతలలో
నిభృత హృదయరహస్యాల వింత వింత పుంతలలో
శవ వక్రాధర స్మితిలోన చిర నిమీలిత నయనాల
ఛాయాచ్ఛాదిత మేధా బాధా గాథా ప్రాక్తన వనాల,
సెలల వెలుగు పరుగులలో వెలుగు నగవు నురుగులలో
కోటి కిరణ వర్ణాళుల హరిధనువుల పరుగులలో
తొలివెలుగుల పులుగులలో మరుటరల ఎలుగులలో
ఆదిమ హింస్రోరగాళి నిదురించే కలుగులలో
లేవక్కడ దయనాగుల శత శిరసులపై కిరణమణులు
కోటి మృతక రహస్యాత్మల ప్రదీప్త నయనఘృణులు
మనసులోని వేనవేల రేఖలలో చాయలలో
మెల్లమెల్లగ చెదరివున్న అర్థాలను చేర్చాను.
చివరికి ఒక స్ఫురణతోడ, ఒక దండగ కూర్చాను.
నేటికి విచ్చినది ఎలాగో నా జన్మాంధకారం
నేనిక వెదకను, నాకిది కడపటి స్ఫురణలో కాంతి,
జీవితపు చరమసీమలో ప్రసవించిన ప్రశాంతి.

- బైరాగి

# వక్రరేఖ

ఒక సంజ్ఞచాలు, వక్రరేఖపై ఒక ప్రకంపన చాలు
స్వప్నారణ్యాలలో ఒక క్షణం అలజడి చాలు
మౌనముద్ర ధరించిన పెదవులపై ఒక మేఘశకలం చాలు
తర్వాత అంతా బీభత్సం, బీభత్సం

అదృశ్య నేత్రాలు అగ్ని వర్షించగా భస్మవేదికపై నీ ఎదుట నీవే
అపుడు సహస్ర రూపాలలో ప్రత్యక్షం కావచ్చు

నీవు రాక్షసుడుగా మారవచ్చు

శూన్యసముద్రాలలో భయోత్పాతం సృష్టించిన జ్ఞాపకాలు
వెంటాడగా, వెంటాడగా
క్షతగాత్రుడై ధూళి మేఘావృతుడైన మనిషి మృత్యుఘోష వినా
మరేదీ అపుడు వినపడదు నీకు

మిత్రుడా నేరం చేశాను
నిశ్శబ్ద సింహాసనం మీద శిరస్సు వ్రయ్యలై అపశబ్దాల మధ్య నన్ను
నేనే అపవిత్రం చేసుకున్నాను
మంత్ర దర్పణంలో భద్రంగా దాచిన నా ప్రతిబింబాలను చేజేతులా
నేనే అన్యాక్రాంతం చేశాను

మిత్రుడా నేరం చేశాను, మిత్రుడా ఘోరం చేశాను
అదృశ్య ప్రాకారాల వెనుక రహస్యోద్యానవనాలలో వికసించిన
చిత్రాక్షరాలను చీకటి నఖాగ్రాలతో చిత్రవధ చేశాను

నా అరచేతులలో నిక్షిప్తం చేసిన సూర్యరశ్మిని చేజేతులా నేనే రాక్షస
నగరంలో భస్మీపటలం చేశాను

మిత్రుడా నేరం చేశాను, మిత్రుడా పాపం చేశాను
చంద్రోదయ వేళ నృత్య మంటపంలో రాక్షసుల నాట్యహేల
దారుణం, దారుణం కారణం నేనే

శిక్ష తప్పదు
స్మృతిపథంలో ఒకే ఒక నెత్తురుజాడ చెరుగుతుందా
ఉద్రిక్త మైదానాలలో ఉన్మత్త మృదంగ ధ్వని ఆగుతుందా
దారుణం దారుణం ఉన్మాదిని నేనే

శిక్ష తప్పదు
మోహినీ వృక్షం క్రింద విషసర్పాలుగా మారిన నా చేతులను
వ్యాఘ్రాగ్ని జిహ్వికలపై దగ్ధం చేస్తున్నాను
మంత్ర దర్పణంలో నా అక్షరాలు ఇక కనపడవు
మిత్రుడా మృత్యువు ప్రాణ రహస్యం ఎక్కడో చెప్పగలవా

ఒక సంజ్ఞ చాలు, వక్రరేఖపై ఒక ప్రకంపన చాలు
స్వప్నారణ్యాలలో ఒక క్షణం అలజడి చాలు
తర్వాత అంతా బీభత్సం, బీభత్సం

– అజంతా

# ఇవాళ ఎవరూ రాలేదు

ఇవాళ ఎవరూ రాలేదు.
ఏ కొలిమితిత్తీ నా లోని
రక్తకణాలను రగుల్కొల్పలేదు.
ఏ ఊపిరి సుడిగాలి నాలోని
బూదిపొరను ఊదెయ్యలేదు.
ఇవాళ ఎవరూ రాలేదు
నాకేమీ తోచడం లేదు.

కణకణమండే ఆ కళ్ళని చూసి
కావ్యాలు రాజేసుకునేవాణ్ణి.
గలగలమోగే ఆ గర్జనలు విని
గహన సమస్యలు ఛేదించుకునేవాణ్ణి.
చెదిరిపడ్డ ఆ జుట్టు పోచల్లో
ఉదధుల ఉన్మాదం పరికించేవాణ్ణి.
కరుచుకున్న ఆ పెదవుల అంచుల్లో
ధరణీ కల్లోలం గమనించేవాణ్ణి.
నిశ్శబ్దాన్ని నరికే ఆ కత్తులు
నిప్పుల్లో తడిసే ఆ వ్యక్తులు
ఎందుకో ఇవాళ రాలేదు.
ఏ ఒక్కరూ - ఒక్కరూ రాలేదు.
ఏమైనారో
ఏం చేస్తున్నారో
రాహువు కోరల్లో చిక్కిన చంద్రాన్ని
రక్షించడానికి వెళ్లారో
చీకటిచెరలోపడ్డ సూర్యాన్ని
దూకించడానికే వెళ్లారో
చుక్కలదండులో చేరి
దిక్కుల అడవుల్లో దూరి
తూర్పుకోటపై ప్రభాత పతాక
ఎగరేసే తెగువలో ఉన్నారో
ఏమో? ఏమో?
అందుకేనేమో!
ఇవాళ ఎవరూ రాలేదు.

– సి. నారాయణరెడ్డి

# వాన వెలిసింది

వాన వెలసింది -
కడిగిన పచ్చని ఆకులపైన ఎండ మిలమిలమని మెరిసింది.
మొండి గోడలపైన, ఎండుమోడులపైన
అగణిత వికృత జీవిత శిథిలాలపైన మేలిమి వెలుగు కురిసింది
నీడలు ముసిరిన భువన వదనంపైన తళతళమని చిరునవ్వు
విరిసింది.
నాలోన, సమస్త జగతిలోన ప్రశాంతి,
చల్లని మెల్లని కాంతి.
ఈ క్షణాన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను.
అయినా నాకు తెలుసు, పుట్టలోనే ఉన్నది పాము.
బ్రతుకు చెట్టు ప్రతి కొమ్మను, ప్రతి రెమ్మను చెమ్మలాగు వేము.
తరు తనువుల పసరుల నెత్తురులాగు, మరణం ప్రవహిస్తుంది
అందరిలో
మరణం దహిస్తుంది కాలే పెదవుల ముద్దుల తొందరలో
మరణం విచ్చేస్తుంది కానరాని వింతగ మన ఆనందపు విందులలో
మరణమన్నది మన నీడ, కాదు, కాదు, మనమే మరణం
భీషణ జీవన నిశీథ గర్భాన త్రోవ తప్పిన వారి కొరకు ఒక కిరణం
అది మరణం.
కాని ఈ క్షణాన ఈ మేలిమి వెలుగులోన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను
నేస్తం, నీవెరుగవుగాని, నేను మాత్రం ప్రతి రాత్రీ మరణిస్తాను
ప్రతి ఉదయం (కథలో యువరాజులాగు) జీవించి లేస్తాను -

మరణానికి ముద్దులు పెట్టి ఏ రోజు జీవితాన్ని ఆరోజే కొంటాను.
కత్తుల కవనంతో, నెత్తుటి మొదళ్ళపై పూచిన మంటల కలలతో
మరణపు నగ్న రేఖల్లో మహిత లలిత జీవిత వర్ణాలు నింపుతాను
జీవన మరణాలను కలిపి, హాలహలాన్ని మించిన ఒక హాలను
సృష్టిస్తాను.
కాని ఈ క్షణాన నేను
మరణమన్నది ఉన్నదని నమ్మలేను
జీవితపు చూసిన మాసిపోయే అపురూప సౌందర్యాన్ని, అనంత
ఐశ్వర్యాన్ని
కన్నులు నులుముకొని చూస్తున్న నేను
మరణమన్నది ఉన్నదని ఎలా నమ్ముతాను?
గోపురాల కాంచన కలశాలపైన కిరణాలు
అవి అదృశ్య దేవదూతల చరణాలు
విను, విను, జీవన మరణాల మధ్య ఊగే గంటలు మ్రోగినాయి.
నింగిని నేలను కలిపి, ఒక్క-క్షణం లోకాన్నే నిలిపి ఖంగున
రేగినాయి,
మరకత తృణదళాలు పులకించాయి,
వేనవేల పూలకన్నులు మేలుకొని తిలకించాయి;
మట్టితావితో నిండిన గాలి గట్టిగా ఊపిరి పీల్చుకుంది,
వినూత్న వధువు వంటి విముగ్ధ వసుంధర సిగ్గుతో శిరస్సు
వాల్చుకొంది.
జీవన మరణాల మధ్య ఊగే గంటలు మ్రోగినాయి
దివ్య స్వరతరంగాలు సుదూర సాగర తీరాలకు సాగినాయి
మేలిమి వెలుగు మెరిసింది,
వాన వెలిసింది.

- బైరాగి

# ఎంత ఆవిరి ఎగిసిపోతే

ఎంత ఆవిరి ఎగిసిపోతే ఒక్క మేఘం
ఎంత ఊపిరి ఒదిగిపోతే ఒక్క యోగం
ఎంత నాదం నాభిమూలం చీల్చుకుంటూ
గొంతువాకిలి దాటిపోతే ఒక్క రాగం.

ఎన్ని ఆశలు దివ్వెలైతే ఒక ప్రభాతం
ఎన్ని ఆకులు పువ్వులైతే ఒక వసంతం.
ఎన్ని అడుగులు ఇరుకుదిశలను చిమ్ముకుంటూ
ఎగిరి ఆడే మువ్వలైతే ఒక అనంతం.

ఎంత శక్తిని పంచుకుంటే ఒక్క మథనం
ఎంత రక్తిని చంపుకుంటే ఒక్క మననం
ఎంత దీప్తిని గుండె కడుపున దాచుకుంటూ
అంతుపట్టక గుప్పుమంటే ఒక్క జ్వలనం!

- సి. నారాయణరెడ్డి

# రోడ్లకు నమస్కారం

నేను మాట్లాడే భాష వేరు
మృత్యువాంఛ ప్రజ్వరిల్లుతున్న వేళ మనిషిని
అంతరాంతరాలలో
రహస్య ద్వారాలు నోరు తెరుస్తున్న హోరు
నేను వ్రాసే కవిత్వం వేరు
శిరస్సు బద్ధలై ప్రవహిస్తున్న సెలయేరు
అక్షర హింస కవిత్వం కాదు కనుక

అక్షర హర్మ్యాలలో ఉన్మత్తుని ఖడ్గ విన్యాసాలు
ఆత్మహత్యాసదృశం కనుక
ప్రచ్ఛన్న రాక్షసులకు దూరంగా
రోడ్లమీద నడుస్తూనే నేను కవిత్వం వ్రాస్తున్నాను

రోడ్లు నా ప్రాణం
నేను అన్వేషిస్తున్న రహస్య జగత్తు రక్తనాళాలు అవే
నరక ద్వారాల మధ్య మనిషి అంతర్నేత్రాలు చూడాలని
ఉన్నదా?
మనిషిలో మనిషి సంభాషణ వినాలని ఉన్నదా?
సుడిగాలి సృష్టిస్తున్న నా చేతులను స్పృశించాలని ఉన్నదా?

రోడ్లు నా రహస్య సంకేతాలు
అదృశ్య హంతకులను సూర్యకిరణాలు శిక్షిస్తున్న వేళ
రోడ్ల భుజస్కంధాలపై స్వేద బిందువులలో
నీ ప్రతిబింబం ఒకసారి చూసుకో

రోడ్లు నా జీవన వ్యాకరణం
నడుస్తున్న ప్రతి మనిషి నన్ను ప్రతిబింబిస్తున్న వాడే
ఒకే భాష, ఒకే ఘోష, ఒకే ఆకారం, ఒకే ఆత్మకథ
స్వప్న ఖచితమైన నా శరీరాన్ని రోడ్లకే అంకితం చేశాను కదా
నా వెన్నెముక పొడవునా యుగయుగాల పాదపద్మాలు
జెండాలు, నినాదాలు, జైళ్ళు, సంకెళ్ళు, ఆకలి కర్మాగారాలు,
మృత్యువు శయ్యాగారాలను చీల్చుకొని
సహస్ర ఖడ్గాలుగా విస్తరించిన నా బాహువులపై అడుగడుగునా
నేనే
నా చుట్టూరా మనుష్యులు
మనుష్యులను కబళిస్తున్న మనుష్యులు

సుఖ దుఃఖాల మధ్య నిర్లిప్తంగా నడుస్తున్న మనుష్యులు
అరచేతులలో ఎడారులను మోసుకొని వస్తున్న మనుష్యులు
శిక్షా వాక్యాలవలె నిలబడిన భవనాలలో మనిషి భవిష్యత్తును
ఉరితీస్తున్న మనుష్యులు
కన్నీళ్ళ వలె మెరుస్తున్న మనుష్యులు
రగులుతున్న గాయంనుంచి నెత్తురు చుక్కలవలె రాలుతున్న
మనుష్యులు
అంతా నన్ను చీల్చుకుని వస్తున్న వాళ్ళే
నా కన్నుల వెనుక రహస్య జలపాతాలను ఛేదించుకొని
వస్తున్నవాళ్ళే

రోడ్లు నా సర్వస్వం
నగరారణ్యాలలో అర్ధరాత్రి భయంకరాట్టహాసాలు వినాలని
ఉన్నదా?
మనిషి సింహ సదృశుడుగా మారుతున్న దృశ్యం చూడాలని
ఉన్నదా?
భ్రాంతిని సంహరిస్తున్న నా చేతులను స్పృశించాలని ఉన్నదా?
రోడ్లు మలుపు తిరుగుతున్నచోట శిలావిగ్రహాల హెచ్చరిక
ఒకసారి వింటే చాలు
వంతెన క్రింద నీళ్ళలో కలల అలలపై నీ ప్రతిబింబం ఒకసారి
చూసుకో

రోడ్లు నా ఇతివృత్తం
చీకటి హాలాహలాన్ని ఆస్వాదిస్తున్న వీధిమహర్షి నా కావ్య
నాయకుడు
నేనెవరో తెలుసా
నాపై విషాద మేఘాలు రువ్వుతున్న వారెవరో తెలుసా
నన్ను వాగ్బంధనం చేస్తున్న వారెవరో తెలుసా

నన్ను రహోబిలంలో పడద్రోస్తున్న వారెవరో తెలుసా
నా మస్తిష్కాన్ని కాటువేస్తున్న వారెవరో తెలుసా
జీవన సౌరభాన్ని నడివీధిలో వేలం వేస్తున్న వారెవరో తెలుసా
మేఘచ్ఛిన్నమైన ఆకాశం క్రింద రోడ్ల పొడవునా
శిథిల వృక్షాలకు నమస్కారం చేస్తున్న పరివ్రాజకుడా
విధ్వంసక యంత్రాలను ఆలింగనం చేసుకుంటున్న
సాహసికుడా
నీ చేతులను నీవే ఉరిత్రాళ్ళుగా మార్చుకుంటున్నవాడా
నీవు మరెవరో కాదు నేనే
నన్ను వెంటాడుతున్న దారుణ మారణ జ్వాలా హస్తాలను
హతమార్చగలనా నేను?
మనిషి నిర్మిస్తున్న రాక్షస నగరంలో అతడే కాదు నేను
కూడా
ఒక ఖైదీనే.
న్యాయపీఠాల మధ్య విషభాండంలో
మనిషి పాదాల క్రింద పాపభూయిష్ఠమైన భస్మరాసులలో
నేను కూడా ఉన్నాను

రోడ్లు నా ఛందస్సు
శిరస్సు బద్ధలై ప్రవహిస్తున్న స్వప్న జలాలలో స్వచ్ఛమైన
మనిషి ఒక క్షణం సాక్షాత్కరించినా చాలు
రెండు రోడ్లు కలిసికొంటున్న చోట ఏదో కొత్త స్పృహ
కొత్త భాష ఆవిర్భావం అక్కడే
ధూళి వృక్షాలు రాల్చిన అక్షర కుసుమాలను అలంకారంగా
ధరిస్తాను
రోడ్లు నా నిఘంటువు, నా అక్షర ప్రపంచం అదే.

- అజంతా

*

నన్నేమైనా అనండి పరవాలేదు
నేను బానిసని, పనిచేసే యంత్రాన్ని
భావాలని మూటకట్టి పాతి పెట్టేసుకున్నవాణ్ణి
పనికిరానివాణ్ణి, బతకలేనివాణ్ణి
అవును నేను మీకు పనిముట్టుని, గొడుగుని, చీపురుకట్టనీ
పనిలేనప్పుడు నవ్వించి, కవ్వించవలసిన యవ్వనుణ్ణి
పాఠాలు చెప్పే పండితుణ్ణి
పక్కవేసి పెట్టె సేవకుణ్ణి
వడ్డించిన నిండు భోజనాన్ని
వాహనాన్ని
ఆయుధాన్ని
వట్టిపోని గొడ్డుని
నాకు ఊహలుండటానికి వీలులేదు
నేను గానుగ తిరగడం మానడానికి వీలులేదు
నాకోసం లోకంలో ధర్మం దెబ్బతినకూడదు
నా పేరు మీ నీతికి కళంకం తేకూడదు
నేను పరిధి దాటి నడవకూడదు

నన్ను కన్నతల్లికి కుమారుడిగా
తమ్ముడికి అన్నగా
ఇంటికి పెద్దవాడిగా
వంశోద్ధారకుడిగా
నా ప్రియురాలికి ప్రియుడిగా
మిత్రులకి మిత్రుడిగా
నిరంతరం పనిచెయ్యాలి, పనికిరావాలి
నేను నేనుగా బతకడానికి వీలులేదు
ఇంతమంది కోరికల మేడలు కూలిపోకూడదు
ఈ పద్మవ్యూహం అభిమన్యుడుండకుండా వృధా కాకూడదు

నాగరికత నాపేర హత్య కాకుండా చూడటానికి
న్యాయం, ధర్మం పెద్దలు రాసిపెట్టినట్టు నడవడానికి
మీరంతా చిన్నా, పెద్దా ఊహల ఉయ్యాలలూగడానికి
నేను ప్రేమ పేరున, అభిమానం పేరున, వాత్సల్యం పేరున
నిండుగా ఒప్పుకుంటున్నాను
మీకు బానిసగా ఉండటానికి
నడివీధిలో గడసానిని కావడానికి
న్యాయంగా గంగిరెద్దుని కావడానికి
మీ ఆశలకి మరో యుగం ప్రాణం పొడిగించడానికి
అందుకనే అందరిముందూ
నా ఆఖరి రక్తపు చుక్కలతో
చేవ్రాలు చేస్తున్నాను
ఆత్మసాక్షిగా

* ఈ పద్యానికి శ్రీ నారాయణరావు
ఏ పేరు పెట్టలేదు.

- వెల్చేరు నారాయణరావు

# లోకాన్ని కాదని

లోకాన్ని కాదని
కాలదన్ని
తెగించి దూరమై
దౌర్భాగ్యమే కోరివరించి
వొంటరై వెలిపడి
గతిలేక వెతచెంది

ఒక్క స్నేహ వాక్కు
  వినరాక
ఒక్క దయాభాసం
  కానరాక
మూలచేరి చీకట్లో
  నా కర్మని తిడుతో, శపిస్తో
    నెత్తురు కన్నీళ్లతో
      కుళ్లి యేడుస్తాను!...

కాని ప్రియా,
  నాకై ప్రేమతో
నిరంతర
  శోకయాత్రలో
నన్నొదలక వెంబడిస్తో
  నావెంటే నువ్వున్నావని
    మనసులో మెరిసి

తృటిలో నా బ్రతుకంతా
  శాంతకాంతి విచ్చి
సర్వ మెదిర్చి ధిక్కరించి
  నడిచే త్రాణవొచ్చి

మహదానందంతో
  ఈశ్వరుణ్ని స్తుతిస్తాను,
    నాలో నిన్నుదయించిన
      అదృష్టభాగ్యానికి!

- వజీర్ రహ్మాన్

# మా

వద్దువద్దు
రావద్దు
విరగబూచిన జీవితం లోంచి సరాసరి
వక్రించిన విధిని తిట్టుకుంటూ
నా హృదయంలో ఇటువైపు మాత్రం
ఏ క్రూరశాపవశాన్నయినా సరే అడుగుపెట్టొద్దు
అన్నల్లారా తమ్ముళ్లారా తల్లుల్లారా అక్కచెల్లెళ్ళారా
ప్రియబాంధవులారా గర్భలోకాల భవిష్యత్ కనుపాపల్లారా
నా ప్రశ్నలకి తలవంచుకు వెనక్కిమళ్లే
సముద్రకెరటాల్లారా
మాట్లాడని మౌనుల్లారా పక్షుల్లారా
ఇటుమాత్రం ఎవరూ రావద్దు
మానవుడి మూర్ఖత్వాన్ని రాక్షసత్వాన్ని అజ్ఞానాన్ని ఆక్రందనల్ని
రెండు ప్రపంచ మహాసంగ్రామాల బూడిదని
కళ్లులేని కామాన్ని
కోర్కెల కుష్టురోగాల్ని అసూయల్ని ఆగ్రహాల్ని
నగరాల దుర్గంధాన్ని యింకా ఎన్నో మరెన్నో
పేరు తెలీని ప్రవృత్తుల్ని
20 శతాబ్దాల దారుణ మానభంగాల్ని
భ్రూణహత్యల్ని అంతులేని అంధకారాన్ని
ఇక్కడ దాచాను ఇక్కడ పూడ్చాను
వద్దువద్దు
ఇక్కడికెవ్వరూ రావద్దు
ఈ తలుపుల్ని తెరవొద్దు
నా హృదయంలో యిటువైపు ఎవరూ అడుగుపెట్టొద్దు

- నగ్నముని

# సముద్రం

సముద్రం వైరుధ్యాలపుట్ట
సముద్రం వైరుధ్యాల పరిష్కారం
సముద్రం వైవిధ్యాల గుట్టు
ఐక్యతకు గుట్ట.
సరిహద్దుల్ని చెరిపేసే
పరసీమ సముద్రం

సముద్రం ముందు నిలబడితే
సముద్రం నా ముందు కెరటమై నిలబడితే
సముద్రం తప్ప నా కళ్ళ ముందు మరేమీ ఉండదు
మనసు సందులో
సముద్రం తప్ప మరేదీ దూరదు
గదిలో కూర్చొని సముద్రాన్ని రాయబోతే

కాళ్ళకింద నీళ్ళు
సముద్రపు మంట లాగ
కళ్ళల్లో నీళ్ళు
ప్రజాసముద్రపు బాధల్లాగ.
గుండెలో సముద్ర ధ్వని
శ్రీకాకుళాన్ని నెమరేసే కరీంనగర్ లాగ

కలంలోంచి సముద్రం
నా బతుకు పొరల్లో, స్మృతి తెరల్లో
కలల్లో దాచుకున్న విలువైన ఊహావలె
ఉరికి వస్తుంది గానీ
దాన్ని నిలపడం ఎట్లా
దానికి అక్షరాల అంగీలు తొడగడం
ఎట్లా?
చప్పన్నారు దేశాలను చప్పరించి
ఉప్పనగా ఉన్నాయని తేల్చేసిన సముద్రాన్ని
భూమినంతా ఒక చుట్టుచుట్టి
భూగోళం తిరుగుతోందని తేల్చేసిన
సముద్రాన్ని కాగితంపై నిలబెట్టడమెట్లా!

ప్రవాహాన్ని మనసుకు ఆవాహన చేసుకోవాల్సిందే తప్ప
ఏ బిందువుదగ్గర ఆపి దాని స్వరూపాన్ని వివరించగలం!

చూపుకు ఎత్తైన కెరటం
పాదాల అడుగున నీ పాదమెంతో అంతే
రూపుకు రవ్వల జడి
ఆచి విసిరిన విద్యుద్ఖడ్గం
అనంత రోచిర్నివహం

నాలుక చివరన నిలువని ఉప్పన
ఎక్కడ మొదలయిందో
ఎంత ఉద్వేగంతో ఉధృతంతో
ఉరకలు వేసి వచ్చిందో
భయం గొలిపే మహాదాకారం
ఆకాశాన్నీ భూమినీ ఆవరించిన సముద్రం
ఇసుక రేణువులముందు తలవొంచి
నీ పాదాల దగ్గర నువు సాకుతున్న గుర్రంలా
నిన్ను స్పృశిస్తూ నిలిచిపోతుంది
నీ పాదాల దగ్గర జారిపోతుంది

ఏదో చెప్పాలని వచ్చి చెప్పకుండానే
నీ చూపులలోనూ స్మృతిలోనూ
నిలిచిపోతుంది
అగాధ సముద్రం.

శత్రువుకు
నేను సముద్ర సంభాషణనని తెలిసిపోయింది
నాది సముద్ర సంస్కృతి అని తెలిసిపోయింది
నేనే హోరెత్తిన సముద్రాన్ని కాకపోవచ్చు
నేను సముద్రం హోరును
నేను పోటెత్తిన సముద్రం నోరును
నేనే 'తూర్పు పడమరలను తుడిచిపెట్టే
ఉత్తర దక్షిణాలను ఊడ్చిపెట్టే
ఉప్పెన'ను కాకపోవచ్చు
ఉప్పెనతో పెనవేసుకున్న గీతాన్ని నేను
ఉప్పెనకు సంకేతాన్ని నేను

ఎగసినప్పుడు కెరటమై
విరిగినప్పుడు నీళ్ళైన సముద్రం
బానిసగా చెమటయి
ఎదురుతిరిగితే నెత్తురవుతుంది
మట్టిలా పడుండి తట్టి లేపితే
వ్యవసాయ విప్లవమవుతుంది
తానే సరుకై, దారై, తెన్నయి
ఓడయి, చుక్కానై
ఓడిపోయి పరాయిదై
తుఫానయి తాను తెలుసుకుంటుంది సముద్రం

తుఫాను నన్ను ముంచెత్తినప్పుడు
అది పిలుపు కాదు
సముద్రం నన్ను తనలో కలుపుకోవడం
నేనూ సముద్రాన్ని అని తెలుసుకోవడం
సముద్రానికి స్వేచ్ఛ లేదు
నాకు స్వేచ్ఛ లేదు
సముద్రం మహాసంక్షోభంలో వుంది
ఆ సంక్షోభంలో నేనున్నాను
సముద్రం ఆటుపోటుల్లోని
అలను నేను కలను నేను కలతను నేను
గొప్ప శాంతి కోసం మహాసంక్షోభంలో
స్వేచ్ఛను కోల్పోయిన సముద్రాన్ని నేను
సముద్రం స్వేచ్ఛలో
సత్యమైన స్వేచ్ఛలో
స్వేచ్ఛను వెతుక్కొంటున్న నీటిచుక్కను నేను.

– వరవరరావు

# అలలు

అలలపైన నిషూ!
అలలు కనే కలలపైన నిషూ!
అలలపై అనురాగం చూపించే
చిరుగాలి సితారా సంగీతంపై నిషూ!

అలలపై కదిలే
పడవలపై నిషూ!
పడవల తెరచాపలపై నిషూ!
పడవల తెరచాపల తెల్లదనంపై నిషూ!

ఉరికంబం మీద అలలు!
కటకటాల వెనుక అలలు!
కన్నీళ్ళలో అలలు! అలలు!
కారడవిలో అలలు! అలలు!
కడలి జనం! అలలు దళం!
అలలు కడలి ప్రాణప్రదం!

అలల కంఠంపై కత్తి!
అలల గాయాలనుండి కొన్నెత్తురు!
సముద్ర దొంగల గుర్రపు డెక్కలకింద
అలల గాయాలనుండి కొన్నెత్తురు!
కత్తులతో సముద్రం గుండెల్లో గుచ్చుతూ
పచ్చినెత్తురు తాగుతూ దొంగలు! సముద్ర దొంగలు!
మట్టికాళ్ళ మహారాక్షసి పుత్రులు
అన్ని తీరాల్లో తిరుగాడే దొంగలు!

అలలు ఏడ్చినవి
విశాల విషాద సముద్రము
అలలు ప్రశ్నించినవి
సముద్రమంతా హోరు
అలలు కదిలినవి
సముద్రమంతా పెనుగాలి
అలల కొసల మంటలు
సముద్రంలో బడబాగ్ని
అలలు కదలినవి
అలలు హోరెత్తినవి
అలలు వలయాలు పన్నినవి
తీర తీరాలు తాకినవి

ఏకాంత ద్వీపాంతరంలోని
మట్టికాళ్ళ మహారాక్షసిని కూల్చినవి.

అలల నెవ్వరడ్డగలరు?
కడలి నెవ్వడాపగలడు?
సముద్రం పురుటి నొప్పులుగా అలలు
దరిద్రం రేపటి కోసం కన్న కలలు
అలలు సముద్రం చేతి కత్తి
అలలు సముద్రం చేతి కలం
ఉదయం నిండా అలలు
అలలు అలలు అలలు
నీలో నాలో
అలలు
అలలు కనే
కలలు
కలలు తెగిన
తలలు

అలలపైన నిఘా
అలలు కనే కలలపైన నిఘా
అలలపై అనురాగం చూపించే
చిరుగాలి సితారా సంగీతంపై నిఘా!

(ఉప్పొంగే సముద్ర తీరంలో నిలుచున్న నాలో
ఆలోచనలు అలలు అలలుగా...)

- శివసాగర్

# ఒఖడే

**ఒఖడే**

అర్ధ స్వప్నాలు, అర్ధ సత్యాలు
చుట్టుకు గడిచిపోతాయి వ్యర్ధంగా జీవితాలు

గాలి గాయపడుతుందని ఆకు రాలదు
నేల నొచ్చుకుంటుందని మొక్క మొలవదు
అలా అనుకుంటాం
అయినా యేదీ ఆగదు

ఆ మూలన ఒకడు
మృత్యునైశిత్యపు వులితో శిలలు చెక్కుతుంటాడు
నచ్చీనచ్చక వీర్యాండపు బండల మీద పగలగొట్టి
మళ్లా మళ్లా చెక్కడం మొదలెడ్తాడు
విషాద గీతాలాలపిస్తాడు.
విదూషకుడు వినోదానికి
గెంతులేస్తూ

వంకర టింకర పాటొకటి పాడుతుంటాడు
యుగాలుగా ఇదే ఎడతెగని దారంటాడు
దొరికింది తినండి తాగండి
సుఖంగా నిద్ర పొండంటాడు.

అసలు ఎవడికి వాడే అంతవరకూ స్వీయ శవవాహకుడంటాడు
ఒకడు
కంట ఆశానక్షత్రం మెరుస్తాడు
చేతిలో చలచ్చలన జీవన కేతనంతో
కాదిది కాదిదంటూ
కైకై నింగికి లేచి మోగుతాడు
మరొకడు అతని కంఠనాళానికి గాలం వేసి
నేలకి లాగుతుంటాడు.

ప్రపంచపు అనేకానేక వికృత రణగొణ ధ్వనులు ముంచెత్తుతున్నా
ఒక కేక ఒక సజీవ గీతమై సంగీతమై
సుసందేశమై సుభిన్న ఆలోచనై
నా
మనసు మెదడుల గట్లని కోసుకు లోపలి కెళుతుంది.

ఓ పువ్వు పూస్తుంది
జీవితం సంపన్నమౌతుంది
అర్థవంతమై సాగుతుంది

ఆ వొఖడి వల్లే.

- శైల్

# కళ్లు మాట్లాడే భాష

చెట్టు పరచిన నీడమీద
ఒక చిన్న పొద నిల్చో ఉంది
బొద్దుగా ముద్దుగా-
కొమ్మ మీద పక్షి వాలింది
పొద మీద పువ్వు రాలింది....

ఎరుపుమయం
ఎరుపులోని ఆనందం
అతిరమ్యం

ప్రకృతిలో పూలు
ఎరుపు మందారం
స్త్రీల నుదుటి తిలకం
ఎర్రని సిందూరం

ఎరుపు రంగు ఎన్నటికీ
కాదు అపాయం
అపాయాన్ని తప్పించే
ఒక సదుపాయం
మనలోనే ఎరుపున్నది
మరచిపోకుమా
మన రక్తం ఎరుపు ఎరుపు
తీసి చూడుమా
ఎరుపులోనే మెరుపుంది
పోరాడే శక్తుంది
శ్రమజీవుల హక్కులకై
ఎలుగెత్తే అరుపుంది
ఎరుపంటే కొందరికి
భయం భయం
పసిపిల్లలు వారికన్న
నయం నయం

- సుబ్బారావు పాణిగ్రాహి

# కళ్లు మాట్లాడే భాష

చెట్టు పరచిన నీడమీద
ఒక చిన్న పొద నిల్చొని ఉంది
బొద్దుగా ముద్దుగా-
కొమ్మ మీద పక్షి వాలింది
పొద మీద పువ్వు రాలింది....

పొదపైకి చూచింది
నాకు భయం వేసింది
ఇక వెళ్ళిపోతుందేమో అని
పలకాపుస్తకాలు తీసుకుని - -

యెదుట రంగులతో స్పందించే చిత్రంలో చిన్న పొద
ఇప్పుడు నా తలపుల నక్షత్ర బిందువుల్ని
బొట్టు బొట్టుగా చప్పరిస్తూ ఉంది-
దాని మీద ఎగిరే సీతాకోకచిలుక
నా చూపుల శాంతికి భంగం కలిగిస్తోంది

ఈ దృశ్యంలో పక్షికూ్కడా తావులేదు
పూలవాహనాల మీద కింజల్కాలూ
కుసుమపరాగాలూ మాత్రమే ఎక్కుతాయి
పరిమళాలు కూడా గాలి ఊచలు పట్టుకుని
ప్రయాణం చేస్తాయి...
ప్రతివస్తువూ ఒక వ్యక్తిత్వంతో
మసలుతున్న ఈ చిత్రంలో
దేన్ని కదిలించినా మరొక దానికోసం,
నా ఊహల లోకాల్లో
బాధల తుపాను రేగుతుంది
అప్పుడు నా కళ్ళు మాట్లాడే
భాషల అర్థాలు
ఎవ్వరికీ తెలీవు-

- గుంటూరు శేషేంద్రశర్మ

# చిగిర్చే చెట్టు

నడచివచ్చి నిశ్శబ్దంగా
నా కిటికీ దగ్గిరాగి
హటాత్తుగా
పటేలుమని
వంద వాయిద్యాలతో
వికసించిన బ్యాండుమేళంలా
ఒక రోజు
అకస్మాత్తుగా
చివురించిన చెట్టు
గవాక్షం వద్ద నన్ను ఆపేసింది.

పడవంచున కూచుని
పరికించే సాగరప్రియుడికి
ఒకొక్కప్పుడు
అకస్మాత్తుగా
సముద్రపు నీలికళ్ళల్లో
సందర్శనమిచ్చే
చేపల గుంపులా
చిరుతోకల్ని ఊపుతో
ఏకాభిముఖంగా
ఆకుచివుళ్ళు ఈదుతున్నాయి
కొమ్మల
కొసల్ని

దూరాభారం చేత పలచబడ్డ
దూరపుకొండల్లా

నిద్దట్లో వికసించిన
పొద్దుటి కనురెప్పల్లా
ఆకాశాన్ని వడపోస్తున్నాయి
ఆకులు
చిగిర్చే చెట్టుకి
ఎగిరే పిట్ట ఆదర్శం;
పత్రాల్ని విదిల్చి
పైకెగరాలని ప్రయత్నం.
కదలక మెదలక
కప్పులు మూసుకుని
నిద్రపోయే
క్షుద్రగృహాలకు
అతీతంగా ఎదుగుతుంది.
అందుకనే,
శీతాకాలం ఎత్తివచ్చినా
భీతిచెందదు చెట్టు;
వీపులపై
మ్యాపులతో
పత్రాలన్నీ నిశ్శబ్దంగా
ధాత్రికి దిగివచ్చి
సామాన్యమైన మట్టితో
సారూప్యం పొంది
మ్యాపుల్లోని రహస్య
మార్గాల గుండా
చేరుకుని వృక్షశిఖరాన్ని,
చలిమూకని
చావుదెబ్బ తీస్తాయి.

- ఇస్మాయిల్

# నిరీహ

అట్లా అని
పెద్ద బాధా ఉండదు.

వెల్ల వేసిన గోడలేమో తెల్లబోతూ ఉంటాయి
విద్యుత్కాంతికి.

మహో అయితే ఏ బల్లో ప్రాకుతూంటుంది
గోడమీద.
దాని నీడ ఒక్కటే ఛాయామాత్రంగా మెదుల్తుంది
విచారంగ.
ఎక్కడో దూరాన్నుంచి పట్టి లాక్కొస్తుంది ఏ సినిమా పాటనో
రికామీ గాలి.
తీరా ఆ ఆఖరి చరణాన్ని వదిలేసి వెళిపోతుంది రోషంగ,
జుట్టు పై కెగదువ్వుకుని.

ఇక నే నా చరణాన్ని మననం చేసుకుంటుంటాను నా
దిగులుతో కలిపి
తెల్లవారెను కోడిగూసెను కోడిగూసెను తెల్లవారెనని
నూర్జహాన్‌నీ [1] నన్నూ వడబోసుకుంటూ
హరే రామ హరే రామ రామ రామ హరే హరే లాగ.
గోడకు తగిలించిన గళ్ళటెరిలిన్ చొక్కా
మెల్లగా చేతులు కదుల్చుతుంది.

ఉదయం దానికి పూసిన నైట్ క్వీన్‌ని వాసన చూచుకుంటుంది.
రాత్రిలో ఒక్కతే.
నూనెలా మెరుస్తోన్న నల్లని గచ్చుమీద చీమ ఒకటి
కాశీ యాత్రకి ప్రాకుతూంటుంది.
ఇది దిగులు చిత్తప్రవృత్తి సీన్.
సెంట్ రాసిన చొక్కాకి దిగులు.
బల్లికి ప్రాకలేని కాళ్ళల్లో గాలి నిండిన ఎగొని.
బరువైన చివరి నూర్జహాన్ చరణానికి మెలంకొలి.
పాలిపోయిన గది గోడలకు ప్రతీక్ష.
పొగ నిండిన అగరొత్తుల పడగ్గదికి పొగలో మెలికల అన్వేషణ.
బలాదూరు గాలికి నైరాశ్య జనితోత్క్రోషం.

చీమకు పలాయనాధ్యాత్మికావేశం.

వస్తుగతం కాని కవితకు భావం బలం.
కేవలం భావంలో భవం.
అధివాస్తవిక విచారమ్ అవ్యక్తమ్
అగమ్య గోచరమ్.
గమ్యమే లేని జానేదేవ్ గాలి.
వ్యక్తావ్యక్త చరమ చరణమ్.
దిగులు గుండెల పగుళ్ళకు
స్వాతి చినుకుల సాంత్వన వాక్యా
లేవి మరీ!
కరుచుకుపోయిన బల్లిలా గోడకు
నిచ్చెన ఉంటుందిగాని తీరా ఎక్కే-
వాడెవ్వడు?
వస్తువూ లేక, స్వీయాత్మా లేకనే
నేననటం
పోనిస్తూ
పెద్ద బాధా లేదని
వాక్యుయెస్[2] బల్లి ప్రలాపంలో
--రక్తం స్రవిస్తున్నా.

1. మధురగాయని; రేడియో పాకిస్తాన్‌లో
2. Vacuous = Suggesting absence of thought. ఈ కవిత చెప్పేదిదే.

- వేగుంట మోహన ప్రసాద్

# సూర్యకవి

సూర్యుడు సుకవి.
ఈ నదీకావ్యాన్ని అల్లినది
అతనే.
ఈ ఝరీగీతాలూ అతనివే.
ఋతుకృతుల్నీ
సంధ్యారుణ గీతాల్నీ
పూలపదాల్నీ
నిద్రలోవున్న నది కనురెప్పల మీది
ఉషః శ్లోకాల్నీ
పలికింది అతనే.
అగ్ని ప్రబంధకర్త ఆయన.
ఈ నిత్య నూతన జగత్కావ్యాన్ని
శ్లేషించి ధ్వనిమయం చేశాడు.
కానీ
చెరువు గట్టుకింది
గుడిశ చీకట్లనూ
నా గుండె చీకట్లనూ
మాత్రం -
ఆయన వ్రాయలేదు.

\- తల్లావఝ్ఝుల పతంజలిశాస్త్రి

# ఉదయం

ఉదయం నాకొక గొప్ప నదిలా భాసిస్తుంది
ఉదయం నా కళ్లకు ఆక్సిజన్‌లా పనిచేస్తుంది.

నా శరీర మైదానాల పత్రహరితమంతా
అనంత వ్యామోహంతో పరవళ్లు తొక్కుతుంది
పరిపూర్ణ ఆరోగ్యంతో వర్ధిల్లుతున్న కవిత్వంలా
ఉదయం నా రక్తమై ప్రవహిస్తుంది

సమస్త జన జీవితాన్ని సమాదరించి తరలివస్తున్న
ఈ ఉదయం ముందు మోకరిల్లుతున్నా -
ఎవడు ఏం పారేసుకున్నా లెఖ్ఖలోకి రాదు - కానీ

ఉదయాన్ని వదులుకుంటే జీవితం వైదొలగిపోయినట్లే
సమస్త దీనజనుల పాదాల సవ్వడులు నిండిన
సమస్త కార్మిక లోకపు వజ్ర సంకల్పాల అగ్ని ప్రవాహాలు
నిండిన
ఆశల ఆనందోత్సాహాలు నిండిన
ఈ ఉదయంలో మునిగి పునీతుణ్ణౌతా
ఎవడు దేంతోనూ రాజీపడక
జీవితాంతం పోరాటం సాగిస్తాడో
వాడికి ప్రతీక అయిన ఈ ఉదయాన్ని
నాలోకి పీల్చేస్తున్నా

నాలోని అమావాస చీకటుల అసంబద్ధతని ఛేదించిన
ఉదయమా!
నాలోని చావబోయే మొగ్గల్ని వికసింపజేసిన ఉదయమా!
నాలోని క్రీనీడల మరకల్ని నిర్మూలించిన భాసురోదయమా!
నాలోని ఒక్కొక్క అణువునుండి నాదమై వీస్తున్న
ఉదయమా!

నా కరాంగుళుల్లో నిన్ను కేంద్రీకృతం చేసుకుని
నా అక్షరాల ద్వారా ప్రసరిస్తున్నా -
ఓ ఉదయమా! నన్నొక వాహకం చేసుకుని
నా జనులకి తగినంత స్తన్యాన్నియ్యవే

- కె. శివారెడ్డి

# అనుభూతి

## 1

పురందరదాసు కీర్తనేదో
ఒక మధ్యాహ్నం
బయటెక్కడో కాస్తూన్న ఎండలోకి
చూస్తూ నాదస్వరంలో విన్నపుడు

ఆ మేఘాలు కదలాడినయ్.
గాలి పిచ్చిగా పర్వెట్టింది.
గగన నీలం పల్చబడింది చైతన్యం లోని విస్తృతమై
నా మేనంతా ఏవో పులకలు.
కనులు తడి.
ఆపుకోలేని అనంత జ్ఞాపకాల వెలుతురు
ఎపుడో చచ్చిపోయిన అమ్మ గుర్తుకి;
ఆదిశక్తి తనువంతా విద్యుత్తులా ప్రాకి

ఎన్ని గమకాలు ఆ నాదంలో!
జగత్తంతా శుభంలో పూచి
మన గుమ్మాలకు కట్టిన తోరణాలు అల్లాడినట్లు
ఎంత విసుగు ఆ జాజ్ మ్యూజిక్
వాల్ట్జ్ యివ్వగలదా

ఈ పురా చైతన్యానుభూతి?
ఆ బూర ఊదినవాడు
ఇదిగో యిప్పుడు మేఘంలో
అడుగో సూర్యుడి మీద పడుకుని
మరోత్రుటి తారలచుట్టూ దోబూచులు
మరో లిప్త మన ఇంట్లో, నీడలో, హృదయంలో
సాగర సంగీతాన్ని నిశ్శబ్దం చేసి
సాగరాన్ని నిస్తబ్ధం చేసి
అదుగో ఎన్నో యోజనాలు వెళిపోతున్నాడు.

ఆ సుస్వరం వెళిపోయిన దారినే వెళ్తే
అక్కడ అమ్మ
నాదం నిండా వాత్సల్యం పొంగి పొరలి
పురా బాల్య స్మృతులతో తలంటుపోసి
స్వచ్ఛ ప్రేమతో సాదు బొట్టుపెట్టి
సర్వజగత్శరీరాన్ని ధవళ వస్త్రంతో తుడిచి.

ఒకటే నాదం
ఆనంద నినాదం
నాద స్వరంలో
ఆది స్వరంలో

**2**

గగన నీలాన్ని గాలి
పొరలు పొరలుగా చీల్చుతోంది.
రెండూ అదృశ్యములే.
దిక్కులు ఊహాజనితాలు.

దిక్కులు లేవు.
కృష్ణుడు దిగంబరుడు
కృష్ణుడు శ్యామం.
ఏమీ లేనిది నీలం
ఆకసం ఏమీ లేనిది.

## 3

ఇది నాది
ఈ సంగీత సంప్రదాయం నాది, ఇది అనాది.
అమ్మలా ఇది ఆదిశక్తి.

పురందరదాసుతో బాటూ నేనూ
అక్కడ చంద్రుని చుట్టూరా నేను
చుక్కల్లో తప్పటడుగులు వేస్తూ నేను.
నాతో బాటూ రండి.

అదుగో ఆకాశం మనకోసం గీచిన హాసరేఖ.
అదుగో ఎండలో యింకా మెరుస్తోంది.
ఏ సాయంత్రానికో వెళ్తాం మనం
జడం నుంచి చైతన్యానికి
నాదస్వరం గాలి మూలల్లోకి పాకుతోంది
మన గుమ్మాల తోరణాలు కదలాడుతున్నై.
గగన నీలం పల్చబడుతోంది.
ఎవరో పిలుస్తోన్నారు
ఆ మండిపోతున్న మేఘాల కొస నుండి.
(sans song)

- వేగుంట మోహన ప్రసాద్

# మృత్యువు - ఎముకల చెట్టు

మాతృగర్భంలోని పిండంలో
మెల్లగా ఎప్పుడో
మెత్తగా నాటుకుంటుంది విత్తనం

ఎదిగే తనువులో
తెల్లని ఎముకల చెట్టుగా ఎదిగి
పుష్పిస్తుంది తెల్లని జుత్తుని

ముందుగా వచ్చే పైలట్‌లా
కంకాళం వస్తోందనే కబురు తెస్తుంది
తెల్లని జుత్తు; పువ్వు

గాలులూదే
హోరు స్వరాల్లో
ఇసుక పడగలు లేచి
మళ్లీ తెరచుకోకుండా
కళ్ళను మూస్తే--
మెదడులో కదిలే సజీవ బింబాలు
బ్రహ్మరంధ్రం నుండి ఒక్కుమ్మడిగా
వెలికురికి
వాటి మూలాకృతుల్లో విలీనమైపోతాయి

అప్పుడు చర్మకవచాన్ని
విదళించుకుంటూ
బయటపడుతుంది
మృత్యువు!
ఎముకల చెట్టు!

- కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ

# రాయి

పలకరిస్తే
పలకదు.
కనీసం
కళ్లు విప్పి చూడదు.
దువ్వి బుజ్జగించినా
నవ్వనే నవ్వదు.
రువ్వితే ఉండిపోతుంది
రివ్వున తిరిగిరాదు,
ఎన్నాళ్ళు స్నేహం చేసినా
నిన్ను గుర్తుపట్టదు,
పనికి మాలింది!
అని అనుకున్నాను కాని,
ఇవాళ తెలిసింది
దీనికి మనసుందని.
ఎండలో పడుకోబెడితే
ఎంత వెచ్చబడుతుంది!
సూర్యుడు దీని ప్రియుడు!

- ఇస్మాయిల్

# నేను మానవ సూర్యుణ్ణి

నీ కలని రెండు చేతుల్తో పుచ్చుకొని, ఎక్కడ జారి
పడుతుందో
అని ఎందుకలా ఎదకు హత్తుకొని నడుస్తావ్;
ప్రవహించే కాలంలో పరుగెత్తే రంగుల చేప, జీవితం;
కన్నీళ్ళ వలల్లో పడదు, కలల గాలానికి తగలదు--
రెక్కకొమ్మల్లో ఇరుక్కోకుండా
ఎగిరిపోయే పక్షిదే సుఖం....
అరే! బాధ చూచి నా కళ్ళు కన్నీళ్ళు కారుస్తున్నాయి;
నేను మనిషినన్న స్పృహ ఇచ్చే తృప్తి,
మరేదీ నాకివ్వదు.
ఆకాశపు నీలికన్నుల్లో తారలనే అశ్రువులు నిండాయి.
నాకు తెలీదు కానీ వాడికి తెలుసు
ఈ నాటకం ఎలా మొదలుపెట్టిందో ఎలా అంత
మవుతుందో
అడవుల్లో అశాంతితో పరుగెత్తే దావాగ్నిని నేను
తెలిమబ్బుల మందల్లోనించి వడిగా
ఒక తారవైపుకు పరుగెత్తే చిరుమబ్బును నేను
బాధల్లో మునుగుతాను సంతోషాల్లో ఉదయిస్తాను
నేను మానవ సూర్యుణ్ణి

- గుంటూరు శేషేంద్రశర్మ

# సుప్త చిత్రాలు

గాలి కదలదు
చల్లగా మాత్రం ఉంటుంది
ఏ వంద గదుల్లోనో ఒక విద్యుద్దీపం వెలుగుని జార్చుతూ
ఓదార్చుతూ ఉంటుందా, ఎక్కడో ఒక చోట ఒక్క
పంకా అల్లీబిల్లీ తిరుగుతూ ఉంటుంది.

వాన కురవదు.
నీటి చలిమాత్రం అంటుకోదు.
ఏ ఒక్క మొక్కో ఎండిపోతూ కూడా ఎర్రని పూలను
తెంపుతూ
రాల్చుతూ ఉంటుందా ఆ సుమ సౌరభం. మంచులో
కలిసివచ్చి
పంకా రెక్కల మీద పడుకుంటుంది.

కళ్ళు బరువు
ఆవలింతలు ఆగవు
ఎంత ఆర్పుకున్నా నొప్పిపోక నులుముకున్న కొద్దీ మూదిలా
కలలు తేలిపోతయ్ గదా యిక నా కాంతి నీదుకుంటూ
పంకా గాలి లోంచి కిటికీ వెలుపల నీడలో నిద్రిస్తుంది

రాత్రి నిలవదు; నిద్ర ఆగదు; పొగ పీల్చరాదు
వేకువలోనే సూర్యకిరణాలు వొచ్చి
చీకటి పాటిమన్ను దిబ్బల్ని
పెళ్ళగించి వేసినా బావుల్లో నీరూరుతూనే ఉంటుంది.
పొరపాటున జారిపోయిన పాదరసం బొట్టులా నిదానంగా
జాలిగా టప్పున జారిపోయే ఒక్క కన్నీటి చుక్కలా-

కలలు అయిపోయేటప్పటికి
పల్లెల్లోనూ పట్టణాల్లోనూ ప్రజలు కళ్ళాపులు
చల్లుకుంటుంటారు.
ఈ నేలని కృష్ణా కావేరి గోదారీ తుంగభద్ర నీటితో
ఎపుడు తడుపుదామురా అని చూస్తుంటాం.

కురిసీ కురిసీ ఆకాశం తుడిచిన అద్దమ్ముక్కలా ఉంటుంది
తీరా భూమ్మీదా ఉండదు నీరు.
ఆదినుంచీ అంతం దాకా మానవుడు పాడుకున్న
మహామధుర గీతాల తాలూకు మ్యూజ్హౌస్, సైగల్ రికార్డులు
రోజుకొకటి వింటుంటాడు విరాట్పురుషుడు -
వినీ వినీ వెక్కి వెక్కి ఏడుస్తాడు

- వేగుంట మోహన ప్రసాద్

# సూర్యకోకిలం

చీకటి కాకి
చుక్కల గుడ్లని
రాత్రల్లా పొదుగుతుంది

ఒకే ఒకటి
సూర్యకోకిలం ఔతుంది
మిగిలినవన్నీ
కాకిపిల్లలై
చీకటి కాకితో
ఎగిరిపోతాయి

కాకుల మంద తరిమేసిన
సూర్యకోకిలం
ఒంటరిదయినా
సమస్త జగత్తునీ
రంజింపజేయ గలుగుతుంది

- కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ

# వేకువ తోట

అంత తోటా
ఒక్కసారి ఉలిక్కిపడుతుంది.
రెక్కలు రిక్కించి
అదే పక్షి కూస్తుంది.
నిశ్శబ్దం పగులులోంచి
అమృతం ఉబుకుతుంది
అంతగాలీ
ఒక్క క్షణంలో
ఉక్కిరి బిక్కిరవుతుంది.
పేరు తెలియని ఆ ఒక్క చెట్టే
పరిమళాల తుఫానులు వీస్తుంది.
చీకట్లు
నీడలుగా పలచబడతాయి.
కొమ్మల్లో చిక్కుపడ్డ సూర్యుడు
గబుక్కున కిందికి దూకుతాడు.
రాలిపడ్డ తంగేడుపూలు
కణికల్లా మెరుస్తాయి!
ప్రాణవాయువులకు
నిన్నటి నివురు చెదిరిపోతుంది.
సృష్టికాంతుల్లో
ఇవాళటి చిగురు పులకరిస్తుంది.
నిద్రలో పోగొట్టుకున్న ఆయుధాలు
ఒక్కొక్కటే చేతికందుతాయి
కిరణాల్ని ఎక్కుపెడతాన్నేను.

- ఎన్. గోపి

# ఊహల్లోంచి ఊహల్లోకి

ఊహల్లోంచి ఊహల్లోకి ఉయ్యాల
గాల్లోంచి గాల్లోకి ఉయ్యాల
ఆ దిశ చివరనుంచి ఈ దిశ చివరిదాకా ఉయ్యాల
వెల్లకిలా పడ్డ అరసున్నాలా
ఈ పక్కనుంచి ఆ పక్కకి దూసుకెళ్లేటప్పుడు
ఒక్కసారి పొడుగాటి జడ భూమిని తాకుతూ వెళిపోతుంది
పరికిణీ కుచ్చిళ్లు నేలను ముద్దిడుకుంటూ వెడతాయి
ఎక్కడో భూమి గర్భంలో సముద్రం గుండెల్లో
ఒక వణుకు మొదలవుతుంది
లోకమంతా ఉయ్యాలలూగుతుంది
గలగలా పొంగే నవ్వులోంచి కన్నీళ్లు
విచిత్రం! ఎత్తైన చెట్ల వేళ్లు భూమిలో బలంగా
ఉయ్యాల వేళ్లు చెట్టుకొమ్మను చుట్టుకొని గట్టిగా
కొత్త పరికిణీ ట్రంకు పెట్టె వాసనలూ
కావిడి పెట్టె బంగారు నగల మాగిన రంగూ -
కొత్తగా వేసుకున్న పైటపాము జర్రున జారటాలూ
ఏం చేయాలో తోచని కంగారూ పిచ్చి చూపులూ
దయకూడుకుంటున్న కళ్ల పర్యావరణాలూ
ఎటు చూసినా పూలే పూలు; పూల జాతర్ల జ్ఞాపకాల రవళి,
అక్కడ ఉయ్యాల మీద ఆకాశంలో తేలుతూ మా అక్క ఉంది
నా బుల్లి ప్రియురాలు ఉంది
నా కళ్ళు ఉయ్యాలతో పాటు అటూ ఇటూ
ఇటూ అటూ ఊగీ ఊగీ తూగీ తూగీ తూలిపోతున్నాయి
తూనీగల్లా వాలుతున్నాయి కనిపించే జీవన మైదానమంతా
ఉయ్యాల కొయ్యకి కట్టిన తాడు పట్టుకొని
వరుసైన వాడెవడో ఊపుతుంటాడు

బహుశా - ఉయ్యాలతోపాటు ఇప్పటికీ ఊగుతుంటాడు
అప్పుడప్పుడు అరచేతులకేసి చూసుకొని
మురిపెంగా ముసిముసిగా నవ్వుకుంటుంటాడు ఇప్పటికీ
దిక్పాలకులంతా వచ్చి చుట్టూ నుంచుంటారు
పైనున్న దేవతలంతా
వెర్రి ముఖాలేసుకుని నోట్లో వేళ్లు పెట్టుకుని చూస్తుంటారు
'ఏమందం ఏమందం, ఏమానందం ఏమానందం' అని;

ఇప్పటికీ ఊహల ఉయ్యాల నెక్కి ఊగుతుంటాను
ఈ ఊరునుంచి ఆ ఊరికి ఆ యేటినుంచి ఈ యేటికీ
ఈ అడవినుంచి ఆ అడవికీ ఈ పల్లెనుంచి ఆ పల్లెకీ
ఆ పల్లెనుంచి ఈ పల్లెకీ,
ఇప్పటికీ గుండెల్లో ఉయ్యాల కదులుతూనే ఉంది.
యాభై యేళ్లప్పుడు కూడా
వెర్రిగా చిన్న పిల్లాణ్ణి చేసి తిప్పుతూనే ఉంది
ఉన్నన్నాళ్లూ ఊగుతూనే ఉంటాను
ఊపుతూనే వుంటాను
నే వెళ్లిపోయాక
నా పద్యాల వేళ్ల చివర్లు పట్టుకొని
నిరంతరం ఊగుతుంటారు మీరు హాయిగా
కిందనుంచి పైకీ పైనుంచి కిందకీ;
షేక్స్పియర్ అన్నట్టు
భూమ్యాకాశాల మధ్యనున్న సమస్తాన్ని చూస్తూ
అనుశీలిస్తూ అనుభవిస్తూ ఆకారాన్నిస్తూ
ఊపిరి ఆగవచ్చునేమో కానీ
ఉయ్యాల ఆగకూడదు గుండెల్లోని ఉయ్యాల ఆగకూడదు.

- కె. శివారెడ్డి

# బతుకు వాసన

తెచ్చి పెట్టుకున్న
ఏకాకితనమంత
అసహ్యమైంది మరొకటి ఉండదు.
ఇంత విశాల ప్రపంచ వృక్షం మీద
ఒంటరి ఆకంటూ ఒక్కటీ వుంటుందా?
నాకు పరాయికరణంటే అసహ్యం
నాకు దుఃఖమంటే అనిష్టం
చెట్టు నుంచి పచ్చదనాన్ని
నిప్పు నుంచి వెచ్చదనాన్ని
తెచ్చుకోలేని వాడు

భూమ్మీద బతకడానికి అనర్హుడు.
జీవితాన్ని విల్లుగా సారించి
వర్తమానాన్ని గురిపెట్టలేని వాడు
ఇక్కడ శ్వాసించడానికి పనికిరాడు
దుఃఖాన్ని బంతిని చేసి
బలంగా కాళ్ళతో తన్నగలిగినవాడే
భవిష్యత్తు వెండికప్పును అందుకుంటాడు
మనుషుల్ని సమీకరించుకొని
పూలదండలా మారలేనివాడు
బతుకువాసన ఆఘ్రాణించలేడు.
ఆవకాయబద్దలా
చావుని చప్పరిస్తూ
కన్నీటిలొట్టలేసేవాడు
విటుడే తప్ప వీరుడు కాలేడు.
ఇక్కడ బతకడానికే మనం మొలిచాం
బతుకు యుద్ధంలో బరితెగించి నిలిచాం.
రాని చావు కోసం
లేని ఏకాకితనం కోసం
ఎందుకీ విషాద వేషధారణ.
మృత్యువు ప్రేయసిలా కన్నుగీటితే
ముద్దివ్వడానికి భయమెందుకు?
జీవితం చివరితేదీ ముగిసిపోతే
ఈ లోకానికి షుక్రియా చెప్పి
చిరునవ్వుతో నిష్క్రమిద్దాం
అంతవరకూ జీవితాన్ని
వీరోచితంగా అనుభవిద్దాం!

- ఎండ్లూరి సుధాకర్

# బావి

రివ్వున ఆకాశానికి
ఉవ్వెత్తుగ లేస్తుంది మంట.
సవ్వడి చెయ్యక భూమిబుగ్గపై చల్లటి
నవ్వుసొట్టలా ముడుచుకుంటుంది బావి.

పిల్లంగోవిలా లోతుగా
చల్లటి నీడల్ని ఊదుతో
వేళ్ళనీ పెదిమల్నీ
ఒళ్ళంతటినీ ఆహ్వానిస్తుంది బావి.

స్వరాల చల్లటిపిట్టలు వాలగా
పరచి సంగీతపు ఊడల్ని,
మరచిపోయిన పాతవానల్ని
గురుతుకు తెస్తుంది బావిపిల్లంగోవి.

నీడల విసనకర్రని విప్పి
ఎండలో సేదతీరుస్తుంది చెట్టు;
నీడల మడత విసనకర్ర బావి,
వాడుకొమ్మంటుంది చేదతో విప్పి.
పాతవానల రహస్య నిద్రల్ని తట్టి
పాతస్మృతుల సుడిగుండాల్ని గాలించి
ఆ తపించే వర్తమానం కోసం
శైతల్యాన్ని తెస్తాయి చెట్టూ, బావీ, పిల్లంగోవి.

- ఇస్మాయిల్

# బాధల చెట్టు

ఫలానా చోటనీ ఫలానా రోజనీ
తెలియకుండా చెప్పా చెయ్యకుండా
ఎప్పుడో ఒకప్పుడు
అకస్మాత్తుగా అస్తవ్యస్తంగా

బాధల చెట్టు మొలిచేస్తుంది
దాని వేళ్లు ఎంత బలంగా లోతుగా వుంటాయో
దాని చిగుళ్లూ కొమ్మలూ
అంత ఉన్నతంగా గొప్పగా వుంటాయి.
ఆ చెట్టుకు మాట్లాడ్డం వచ్చు
పాటలు పాడ్డం వచ్చు
కథలు - కవిత్వం వచ్చు
నవ్వడం - ఏడ్వడం వచ్చు
అన్నీ వచ్చి అది జీవితాన్ని ఊపేస్తుంది
ఆ చెట్టు నీడన కూచుంటే
అప్పుడే అల్లిన
పచ్చి కొబ్బరాకు చాపమీద
నగ్నంగా పడుకున్నట్టుంటుంది
ఆ చెట్టును తాకితే
తెగిన గాయంమీద
గోర్వెచ్చని నీళ్లు పడ్డట్టు
అది ఖేదమో మోదమో
తేల్చుకోలేనట్టుంటుంది
ఆ చెట్టును కావలించుకుంటే
విరహం తర్వాత కలసిన
ప్రియురాలి చుట్టూ
చేతులు పెనవేసి
స్తనాల మధ్య
మొహం దాచుకున్నట్టుంటుంది
ఆ చెట్టును పలకరిస్తే
ప్రవాసం నుండి తిరిగొచ్చిన

ప్రాణమిత్రుని స్వచ్ఛమైన
నవ్వులా పలకరింపులా వుంటుంది
ఆ చెట్టువంక చూస్తే చాలు
అప్పుడే నడక నేర్చుకుంటున్న కొడుకు
తండ్రి ఒడిలో కూర్చోడానికి
ఎగబడుతున్నట్టు
కొమ్మల చేతులను చాపుతుంది
ఇంత చేసినా -
ఆ చెట్టును చూస్తే
భయంగా బెరుగ్గా వుంటుంది
దూరం దూరంగా వుంటే
అది భయపెడుతుంది.
సాహసించి దగ్గరికెళ్తే
సాదరంగా లోనికి తీసుకుంటుంది
ధైర్యంగా మొదటి కొమ్మ ఎక్కితే
చివరనున్న అమృత ఫలం
చేతికందుతుంది.
అప్పుడు ఆ చెట్టు
మాటగా పాటగా కథగా కవిత్వంగా
కలగా - కన్నీరుగా రూపాంతరం చెంది
గొంగళి పురుగు
సీతాకోక చిలుకైనట్టు
ఎగిరి బతుకు పుష్పంమీద వాలుతుంది

- శిఖామణి

# ఆకాశం పడగ కింద

నీలాకాశం
ప్రశాంతంగా వుంది
తలస్నానం చేసినట్టున్న
సర్వీచెట్లకు
గాలులు మెల్లగా
తల చిక్కుల్ని తీస్తున్నాయి

నేను మునిగి వున్న
మౌనం మడుగు నుండి
గట్టెక్కింది
మునిమాపు వేళో
మునివేకువ వేళో
ఏమీ తెలియనితనం!

చిక్కుల తలతో
ఆకాశం పడగ కింద
అయోమయంగా నేను

గాలుల్ని నిలవేసి అడిగాను
కాలాన్ని అడగమన్నాయి
ఆకాశం ఫాలభాగం మీద
తను వ్రాసిన
నక్షత్రాల బీజాక్షరాల్ని
ఏరుకొని
నా క్షేత్రంలో జల్లుకొని
శ్రమించిన మనసు
కంది స్పందించిన స్వేదం
కన్నీరు
క్షేత్రం లోకి మళ్ళించమనీ
మొలకెత్తిన
సహస్ర కిరణాలే
నాకు సమాధానాలనీ ---

- కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ

# గాయం నుంచి గాయానికి

బిస్మిల్లాఖాన్ బిస్మిల్లాఖాన్ లానే షెహనాయీ విన్పిస్తుంటాడు
వాకిట్లో బోగన్‌విల్లై తీగ బోగన్‌విల్లై పువ్వులే పూస్తూంటుంది

నన్ను మాత్రమే నేను పోల్చుకోలేక పోతుంటాను
శయన సమయానికి నా దినచర్య నెమరు వేసుకున్నప్పుడు
నా రూప శకలాలు చెల్లా చెదురయి ఆందోళన పడతాను
ఆశించినట్లుగా నా పాత్రని పోషించిన క్షణాలు కూడా
నా పరాజయపు చిప్పోల్ని కప్పిపుచ్చలేకపోతాయి
భావించుకున్న నా స్వీయోజ్జ్వలత్వమంతా
నా అసాఫల్యం ముందు వెలవెలబోతుంది
ఒప్పుకోలేని నా అపరిపూర్ణత
అర్ధరాత్రి ఎప్పుడో కలల్లో వికృతంగా గుచ్చుకొంటుంది

*2*

కాళ్ళు కాళ్ల పరిధిలో చేతులు చేతుల పరిధిలో
సకలావయవాలూ తమ స్థానాల్లో నిల్చి జీవితాన్ని
నడుపుతాయి
ఎవరో ఒక ముగ్ధ పరిమళ భరితమయిన రోజాపువ్వుని
ఈ యంత్రం దగ్గర పరాకుగా మర్చిపోతారు
అప్పుడు నాలోంచి విచిత్రమయిన పురుగు ఆ పువ్వుని

స్పృశిస్తుంది
నా మలిన స్పర్శ నాకు తెలియకనా? అయినా,
ఒంటినుంచి జిడ్డు కారుతోన్న
నా నేత్రాల్లో తేజస్సిదీ అని చూపడం మానను
మాసిపోయిన గుడ్డలమీద అలంకారాలు కప్పి
అతిథుల్ని చిరునవ్వుతో ఆహ్వానించడం మానను
పరచుకొన్న శూన్యాన్ని అరచేతుల్తో మూసేసి
అబ్బే మరేం లేదు అని సర్దిచెప్పడం మానను.
కాని వేరుపురుగులాగా స్వయం కృతాపరాధం
మూలాన్ని శిథిలం చేస్తూ ఉంటుంది
పువ్వుల శాలువా కింద దేహం
రుగ్మతతో క్షీణిస్తూంటుంది.
ఇలా ప్రపంచం మీదకు విసిరిన ప్రశ్నార్థకాలు
ఎవరూ చూడకుండా తిరిగి వచ్చి నన్నే నాటుకున్నప్పుడు
ఇక, ఆరోపించే స్వేచ్ఛని కూడా కోల్పోతాను.

## 3

పాపంలాంటి చీకట్లోనో, దానికి ఆవల్నో
ఒక కాంతి బిందువుని వూహిస్తాను
ఆ ప్రకాశ లేశం ఎదుట నా జీవితమంటే ఇదీ అని
ఆశాభంగాల జాబితా ఆశగా ఉంచుతాను
నా గాయాలకు ఎవరు పూచీ పడతారు?
ఏ వ్యాధుల్నో వాటిల్లో వూహించి ఎవళ్లకి వాళ్లు
తప్పుకుపోగా, మానని
గాయంనుంచి మరో గాయానికి అపరాధం అల్లుకొంటుంది,
ఎన్ని గాయాలు కలిస్తే ఒక జీవితం

## 4

తీరాల మధ్య గోదావరి గోదావరిలానే ప్రవహిస్తుంది
ఒడ్డున పకీర్లు పకీర్లలానే ఉంటారు
అలా నాకు నిత్యం తారసపడే కంఠాల్లో, దేహాల్లో ఏ
మార్పూ వుండదు
వాటి మధ్య నడవాల్సినపుడల్లా
నంగిరితనంతో సిగ్గుతో ఒంకర్లు పోయే గొంతుతో
బలంగా స్వచ్ఛంగా ఉక్కులాంటి ఒక్క మాటయినా
పలకాలని ఉంటుంది
అపహాస్యాల మధ్య అవహేళనల మధ్య అవనతమవుతున్న నా
ఆత్మని
ధైర్యంగా నిలపాలని వుంటుంది.
ఎవడి నేత్రాల్లో అశ్రువుల్ని చూసినా
ఆత్మదానం చేసి మరీ పోరాడాలని వుంటుంది
కాని నిరపరాధులకు మాత్రమే
ఆశోపహతులైనప్పుడు కన్నీరు పెట్టుకునే అర్హత ఉందని
తెలిసి
దూరంగా మౌనంగా కించిదసూయతో నిలబడిపోతాను
మంచులాగ నా మీద నా జాలి
నా హృదయాన్ని మంట పెట్టేస్తుంటే
ఏడవలేక, ఎదురు తిరగలేక
వెర్రిగా ఒక నవ్వు నవ్వుతాను, నిస్సహాయంగా
కాని, బిస్మిల్లాఖాన్ బిస్మిల్లాఖాన్ లానే షెహనాయీ
విన్పిస్తుంటాడు

- వాడ్రేవు చినవీరభద్రుడు

# ముద్దుల చేతికర్ర

నన్ను
సముద్రపు టొడ్డున
వొది లేయండి
ముత్యం దొరకలేదని బాధపడను.
ఇసుకలో
పిచ్చుక గూళ్లు కట్టి
ఒక మహాసామ్రాజ్యాన్ని నిర్మించుకుంటాను.
అలలు నడిచిన
అడుగు జాడలు పరికిస్తూ
ఓ గుడ్డి గవ్వను ఏరుకుని
సంబర పడిపోతాను.
నన్ను
తోటలో విడిచిపెట్టేయండి
కోకిల పాట వినబడలేదని
కొంచెం కూడా చింతించను
కొమ్మనున్న పండు కోసం

ఎగిరి ఎగిరి అలసి సొలసి
చివరకు చతికిల పడిపోయి
చిన్న పిల్లాడిలా పిర్రలకు అంటుకున్న మట్టిని
అరచేతులతో అటు ఇటూ
దులిపేసుకుంటాను
నన్ను
తూనీగలాగో
సీతాకోక చిలుకలాగో
గాలిలోకి వొదిలేయండి
పూలు లేవనీ
వన్నెల ఇంద్రచాపం లేదనీ
చిన్న బుచ్చుకోను
గాలి భాషకు
వ్యాకరణ సర్వస్వాన్ని రాసిపారేసి
వర్షాల గురించి
వాయుగుండాల గురించీ
మీ చెవిలో రహస్యాలను ఊదేస్తాను.
అదీ కాకపోతే
ఓ అనాథ పిల్లాడిమల్లే
జన సమ్మర్దంగల
చౌరస్తాలో నన్ను విడిచి పెట్టేయండి
ఆదరించే వారు లేరని
ఆవేదన చెందను
కళ్లు లేని కబోది చేతిలో
మువ్వల చేతికర్రనై
రోడ్డు దాటిస్తాను.

– శిఖామణి

# గోదావరి

ఆకాశానికీ భూమికీ మధ్య
ఇంత పొడవైన నీటి తివాసీ ఎవరు పరిచారో
గోదావరీ! గోదావరీ!! నిన్ను తొలిసారి ఎలుగెత్తి
ఎవరు పిలిచారో
ఏ మహాకవి గుండె కరిగి
అలలు అలలుగా కవిత్వమై పుట్టిందో
తొలిసారి గోదావరితో కరచాలనం చేసినప్పుడు
చిరకాల మిత్రుని చెయ్యి నిమిరినట్టే వుంటుంది.
గోదావరీ! గోదావరీ!! నా బాల్య జ్ఞాపకాల అంతర్ ఝరీ!
నీ ఒడ్డు ఒడిలో తలపెట్టుకున్నప్పుడు
అమ్మ దగ్గరే ఉన్నట్టుంటుంది
నీ ఇసుకమేనిపై పొర్లాడుతున్నప్పుడు
నాన్న గుండెల మీద ఆడుకుంటున్నట్లే వుంటుంది
నువ్వు అమ్మానాన్నవే గోదావరీ!
చిన్నప్పుడు తెలుగు వాచకంల దాచుకున్న నెమలికన్ను
ఈ గోదావరి
ఇప్పుడు గోదావరి ఒక గొప్ప పదచిత్రం
తెరుచుకుంటున్న ఉద్యమనేత్రం
జాలరి గొంతులో సుడులు రేగుతున్న జలరాగం
చాకలి మోతలో మృదంగమవుతున్న విలంబితలయ గోదావరి
శ్రమ జీవన సౌందర్యలహరి
నేల నేలంతా గింజలు మొలిచే ధాన్యబుతువు గోదావరి
నాగేటి చాళ్ళ నాజూకు హరిత సుందరి గోదావరి
గోదావరి భూస్వాములది కాదు
గోదావరి భూమిపుత్రులది

గోదావరి అలల కరపత్రాలది
గోదావరి రాబోయే వెన్నెల రాత్రుల మిత్రులది
తెలంగాణాలో ప్రతిధ్వనిస్తున్న పాటకు
అడవి పాదాల గిరిజన హల్లీసకం గోదావరి
గోదావరి కదిలే ఒక గొప్ప కళాఖండం.
చుట్టూ ఆవరించిన నీటి వలయాల మధ్య
ఎటుచూసినా పచ్చని అరటి డేరాలే
కొబ్బరిచెట్లు గోదావరి తల్లి ముందు
ఎదిగిన కొడుకుల్లా నిలబడతాయి
గోదావరిని ఎక్కడ ముట్టుకున్నా గుండె తడి తగులుతుంది
ఇది భావుకులకూ ప్రేమికులకూ స్వప్న ప్రవాహం
ఆకాశం చిలక్కొయ్యకు
జిలుగు దుస్తుల్ని వేలాడదీసి
తారలు రహస్యంగా గోదాట్లో స్నానమాడిపోతాయి
ఉదయం కొంగలబారులు ముత్యాల గొలుసులై
గోదావరి జలదర్పణంలో ముఖదర్శనం చేసుకుంటాయి
గోదావరి నీటివొంటిపై పడవలు కదిలే పుట్టుమచ్చలవుతాయి
పాపికొండలు గోదావరి పాలగుండెలై
నిలువెత్తు నీటిదండలై నిశ్చల నీరాజనాలౌతాయి.
వర్షాకాలం కొత్త గోదావరి చిక్కని ఇరానీ చాయ్‌లా
ప్రవహిస్తుంది
ఏ కాలంలోనైనా గోదావరి నీటి గుండె పైకి
స్పష్టంగా కనబడుతుంది
ఇవాళ గోదావరి పాత సముద్రంతో చేతులు కలిపినా
రేపటి తూర్పు ఈ గోదావరి
రేపటి కొత్త నీటి కలల చేవ్రాలు గోదావరి....

– ఎండ్లూరి సుధాకర్

# పూలకుర్రాడు

పగటి నాటకానికి
నెమ్మది నెమ్మదిగా
అప్పుడే తెర లేస్తుంటుంది

కొమ్మల్లో పక్షులు
ముక్కులతో వేకువను పొడిచి పొడిచి
పక్షాల ఈకలను సవరించుకుంటాయి
వీధులన్నీ ప్రవాహం ఆగిన నదుల్లా ప్రశాంతంగా వుంటాయి.

ఇంటి ముంగిట అమ్మ చల్లిన కళ్లాపి
తడి ఎప్పుడారుతుందా అని
పోత పొయ్యడమైనా సరిగ్గా రాని చిట్టి తల్లి
అరచేత ముగ్గు చిప్ప పట్టుకుని
గుమ్మం దగ్గిర నిరీక్షిస్తుంటుంది

వీధి మలుపు దగ్గర
సైకిల్ బెల్ ట్రింగ్ ట్రింగ్ మంటుంది
ఆ వెనక మల్లెపూల సౌరభం ప్రవాహమౌతుంది
వాడికి రోజు ఎప్పుడు ప్రారంభమౌతుందో కానీ
సూర్యుడికంటే ముందే వాడు
భూమిమీద వాలతాడు
రేసుగుర్రం లాంటి సైకిలుకు రెండు గంపలు
అటొక పూలవనం
ఇటొక పూలవనం
గొప్పింటి బిడ్డగా పుట్టి వుంటే వాడు

ఈ వేళకు ఇంకా నిద్రమంచం దిగేవాడు కాదు
కానీ వాడు పూలమ్ముకుంటేనేగాని
పూట గడవని పూల కుర్రాడు
వాడిని చూస్తే పూలమ్ముకున్నచోట
కట్టెలమ్ముకున్నట్టున్న సామెత అబద్ధమనిపిస్తుంది

ఆటలాడుకోవాల్సిన సమయంలో
నాలుగక్షరాలు నేర్చుకోవాల్సిన వయసులో
వాడు వీధివీధికీ తిరుగుతూ
కేకలేసుకుంటూ
తన బాల్యాన్ని మూరమూర చొప్పున కోసి
అమ్ముకుంటుంటే
అవి పూలయితేనేం కట్టెలయితేనేం?
ఎండ పొడ తగిలి వాడిలిపోతున్న పూలపై
వాడు చెమటనూ కన్నీళ్లనూ జల్లి
వాటి మృదుత్వాన్ని కాపాడుతుంటాడు

వాడి గంపల్లో పూలు తరగని రోజున
పూలచెండుల చాటునుండి
పెళ్లికాని వాడి అక్కా
మంచంలో కాళ్లు కదపలేని వాడి నాన్నా
వాడిని భయపెడుతుంటారు
పువ్వులాంటి వాడి వయసులో
శ్రమ పరుగై దాగుంటుంది
వాడిని పలకరిస్తే
వాన వెలిసాక
గంగరావి చెట్టుకింద నించోని
చెట్టుకొమ్మట్టుకు లాగినట్లుంటుంది.

నాలుగురోడ్ల కూడలిలో
పూలచెండ్లను పైకెత్తిపట్టుకుని
వాడు నిలబడి వుంటే
ఆకాశం ఎత్తుల్లోకి చొరబడి
అధోముఖంగా విరబూసిన
కొండమల్లె చెట్టులా వుంటాడు.
చీకటి తొలినే
వీధుల్లో పూలగంపలతో వాడు తిరుగుతుంటే
కార్తీకమాసంలో
కోనేరులో వదలిన
అరటిదొన్నెలో వెలిగించిన ప్రమిదలా వుంటాడు
భూమి సూర్యుడి చుట్టూ తిరిగితే
సూర్యుడు వీడి చుట్టూ తిరుగుతాడు
ఎండలో తిరిగి తిరిగి వాడు
మధ్యాహ్నానికల్లా
వాడిన మల్లెచెండు అవుతాడు
అంత అలసటలోనూ వాడు
పరిమళాల్ని మోసుకొచ్చే వాయుదేవుడిలా వుంటాడు.
విరామంలేని అనంత జీవన యాత్రలోనూ
వాడు విశ్వంపై పుష్ప వృష్టి కురిపించే
బాలగంధర్వుడిలా వుంటాడు
బాల్యంలోనే చేత జపమాల ధరించిన బాలయోగిలా
వాడు నిత్యం బతుకు మాలను అల్లుతూ
భూమికీ ఆకాశానికీ పూలతోరణాలు కడుతుంటాడు

(సలాది బుల్లెబ్బాయి (బాబీ) కోసం)

– శిఖామణి

# ఒక నూతన యుగావిష్కరణ కోసం

ఇవాళ నన్ను నేను డైనమైట్లతో పేల్చుకోవాలి; అప్పుడు గానీ నా
హృదయ పాషాణాభ్యంతరాలు తొలగవు

నన్ను నేను తవ్వుకోవాలి నాలోకి, తోడుకోవాలి నాలోంచి.
ఒక్క చుక్క మంచినీటి కోసం, ఒక్క మంచి మాట కోసం.

తుపానుల ఒత్తిడుల మీద, దవాగ్ని కీలల రాపిడుల మీద ఎంతో
వ్యధ చెందితేనేగాని ఈ జీవిత శాఖ ఒక్క లేత చిగుర్ని కూడా
ప్రసవింపదు

ఒక్క నవ్వు నవ్వటానికి, ఈ రోజు నాతో నేను ఒక
మహాసంగ్రామమే
కానివ్వాలి, ఒక్క పువ్వు పుయ్యటానికి ముందు నే నెత్తురొలికించి
కన్నీరు చిందించాలి

నా మానవ ప్రపంచమంతా దుర్భర వేదనల సెగలో నలిగి రగిలి
నప్పుడుగానీ ఒక ప్రవక్త కన్నీటి కొలకులో కారుణ్యపు ముత్యం
తొనకాడదు, ఒక కవిత ప్రభవించదు.
ఒక నూతన యుగావిష్కరణకై తెర తొలగదు...

- వాడ్రేవు చినవీరభద్రుడు

# ఒక జ్ఞాపకం

ఈ జీవితాన్ని ఖాళీ చేసి వెళ్ళిపోతున్నపుడు
ఒక జ్ఞాపకం కావాలి.
అలసిపోయిన గుండెను
సుతారంగా తట్టేందుకు నెత్తుటి చుక్కలో
కరిగిన ఒక అక్షరం కావాలి.
అనుభవంలో తడిసిన
ఈ చిత్తడి జీవితానికి చిదుగుల్లాంటి
ఒక స్పర్శ కావాలి
తుమ్మ చెట్టు మీద చివరి నిమిషం దాక
గడిపిన క్షణాన్ని
వర్షం చినుకు కూడా చెప్పుకోదు
ఎండిన శరీరం మీద పచ్చటి జీవితాన్ని కప్పుకుని
గుండెను విప్పినా
ఎక్కడా ఏ ఒయాసిస్సు కనిపించదు
వేల వేదనల్ని ఏటిలో పారేసి
బయట పడ్డా
చీకటి తెర కమ్ముతూనే ఉంటుంది.
రెండు చేతులూ దొరకవు
బాధగా మెలితిరుగుతున్న
ఏకాంతం గుండెలో ఎన్నిసార్లు వెతికినా
ఒక్క జ్ఞాపకమూ కనిపించదు
పగిలి ముక్కలైన ఒకానొక
జ్ఞాపకాన్ని మాత్రం నిమురుతూనే వుంటుంది దుఃఖం.

- యాకూబ్

# చిన్నప్పటి చెరువు

ఇక్కడేదో తడితడిగా వుండేది
పసిపాదాలు పరుగెత్తుకుంటూ వచ్చి అలసిపోయినప్పుడు
ఇక్కడేదో తడిగా తగిలేది తల్లి చెయ్యిలా
రెల్లుగడ్డి పొదరిళ్ల మీంచీ
ముగ్గులతో సింగారించుకున్న అరుగుల మీంచీ
చిగురుటాకులతో నవనవలాడుతున్న చింతచెట్ల మీంచీ
పచ్చటి పొలాల మధ్య తెల్లగా పర్చుకున్న సన్నటి దారుల్లోంచీ
పొలాల మధ్య తలెత్తుతూన్న మంచెలమీంచీ
గాలినై నేను దూసుకువస్తున్నప్పుడు
ఇక్కడేవో రెండు చేతులు నన్ను చల్లగా తనలోకి
పొదువుకునేవి
దేహాన్ని బార్లా చాపుకున్న ఆకాశం
మబ్బు తునక పొడుగాటి గుంపుల మధ్య
తుంపులు తుంపులుగా వెన్నెల పుప్పొడిని రాల్చేది
చూపులు నడిచిన చోటల్లా
ఒక కల వెచ్చవెచ్చగా వూపిరి విడిచేది
ఎవరో ఇక్కడ నా కోసం
ఎప్పటికీ తరగని మాటల పెట్టెని దాచి వుంచారు
ఇంకెవరో ఇక్కడి గాలి నిండా
వెయ్యి వేణువులు వూది వెళ్లారు
ఈ చెరువే - ఇప్పుడు పగిలిపోయిన గుండెని
ముక్కలు ముక్కలుగా చూపిస్తుందే
దీని అరచేతుల్లో నేనప్పుడు ఎక్కడెక్కడికో ఎగిరి వెళ్లాను

స్ాయంకాలం చిరుగాలి రెక్కలమీద మేము
పగటి కలలోంచి నడిచి వచ్చినట్టు
తూనీగ తూగుతో ఇక్కడ వాలేవాళ్లం
వలయ వలయాలుగా తిరుగుతూన్న
చెరువు గుండెల్లో ఈదేవాళ్లం
పచ్చగా పర్చుకున్న ఒడ్డుమీద
తడిసిన దేహాల్ని ఆరేసేవాళ్లం
మమ్మల్ని కప్పుకుంటున్న బాహ్యలోకపు వస్త్రాల్ని
తుమ్మచెట్లమీద పారేసేవాళ్లం
ఒక చిమ్మచీకటి సాయంత్రం
భూమ్యాకాశాల నిండా ఒకటే చీకటిరేఖ కమ్ముకున్నప్పుడు
ఇక్కడ దీపాల పంట పండేది
పూబంతుల పొత్తిళ్లలోంచి పూల నౌకలు
దీప శిరస్సులు దాల్చి నర్తించేవి
మా దేహాల మీద మెరుస్తూన్న
తొలి యవ్వన కాంతులు చెరువు నీడల్లో దోబూచులాడేవి
అప్పుడు ఇక్కడి రాత్రి
పదహారేళ్ల పడుచుదనపు, యవ్వనాల వంపుసొంపుల్లోంచి
మెరుపు తీగెలా విచ్చుకునేది
ఎన్ని పసితనాల మొదటి ఊహల ఊపిరి దీనికందిందో
ఎన్ని యవ్వనాల లేతస్పర్శ దీని ఒడ్డుని కవ్వించిందో
అప్పుడేదో ఇక్కడ తడితడిగా వుండేది
ఇప్పుడేదో ఇక్కడ పొడిపొడిగా
పగిలిపోయిన భూమి గుండెల్లోంచి
బావురుమంటున్న స్వప్నంలా ...

- అఫ్సర్

# నిన్నటి కల

మళ్లీ అప్పుడే నిద్రవద్దు;
నిన్నటి కల ఇంకా పచ్చిగానే ఉంది.
కళ్ళలో గాలి దుమారం లేపుతూ,
ఎర్రటి ధూళిని రేపుతూ వస్తుంది నిద్ర.
రెప్పల తలుపులు టపటప కొట్టుకొని
ఒక్కసారిగా మూతబడతాయి.
ఎప్పుడో విరిగిన జ్ఞాపకాల దుంగల్ని
తెప్పల్లా మోసుకొంటూ,
వరదై వస్తుంది కల.

నిన్నటి నిద్రలో నేను
నిరాశ్రయుడి నయ్యాను.
నిన్నటి వరదలో
ప్రాణ భయంతో విలవిల్లాడాను.
మళ్ళీ అప్పుడే నిద్ర వద్దు
నిన్నటి ఆ కల ఇంకా పచ్చిగానే ఉంది.
కనిపించని గాయం కల-
వచ్చేపోయే నిద్ర ఎప్పుడో చేసి వెళ్ళిపోతుంది.
ఊహల, భయాల
మృత్యురహస్యం కల.
మరణించిన మిత్రునిలా
వేల భంగిమలలో కనిపించి,
అంతులేని ఆలోచనల మధ్య
తళుక్కుమని మెరిసేది కల.
నిన్నటి కల
ఇంకా పచ్చిగానే ఉంది.

- విన్నకోట రవిశంకర్

# నిజంగా మరణం

ఆకలో
వుప్పెనో
ఆగిన గుండెచప్పుళ్ళో
కాదు మరణమంటే,
ఒక మాట నిలువునా చీలినచోట
ఒక దృశ్యం నిర్లిప్తంగా నిష్క్రమించిన చోట
ఒక మనిషి నిశ్శబ్దంలోకి వెలివేయబడినచోట
నిజంగా మరణం
హత్యలో
ఆత్మహత్యలో
భ్రూణహత్యలో
కాదు మరణమంటే
వెంట వచ్చిన విశ్వాసం నిర్దాక్షిణ్యంగా
హృదయాన్ని కొరికి వుండు చేసినప్పుడూ
ఒక గాయాన్ని గుండెకి గులాబీగా గుచ్చి
ఒక పరిచిత హస్తం
మృత్యుఖడ్గంగా రూపెత్తినప్పుడూ
నిజంగా మరణం.

\- అఫ్సర్

# ఇప్పటికిది చాలు

ఒకే మనిషి
ఇన్ని గాయాలు
ఇన్నిన్ని గాథలు
ఒకే మనిషి
కొన్ని కన్నీళ్ళు
ఇంకొన్ని నదులు
సదా ఒకే మనిషి
కేవలం కళ్ళు
చేతులు అవే
ఒకే ఒక్క మనిషి
అదే అన్వేషణ
మానవుడొక్కడే
నిరీక్షణ
ఒకే ఒక్క ఒంటరి మనిషి
ఇంతింత వ్యధలంటిన కుంకుమదుఃఖం
అదే నెత్తురుచుక్కలు చుట్టిన
అదే నయనం అదే నయనం
శోకాణువై చిట్లిన పిడికిలి కసి
అదే గుండె

అదే చప్పుడు
అదే మానసం
మానవుల పాదాల ముందు మోకరిల్లి
ఎత్తిన రెండు చేతులు
ఒకే మనిషి
అడిగిన ప్రతి గుండె దగ్గరా
అదే శాపాల జాలు
అవే ఏమో అన్నప్పటికీ
నిష్క్రమించని ఊగే
విచార హస్తం
పోపొమ్మని పలికే కళ్ళు
ఇక ఏ హృదయం దగ్గరా
నిలబడనీయని ఓటమి
ఒకే మనిషి
ఒకే మనిషి
పిలిచిన పిలుపుల
అరిచిన అరుపుల
పెట్టిన ఘోషల
వెనుక
వెనుదిరిగి కూలిన మనిషి
కన్నీరై రాలిన మనిషి
ఎప్పుడూ ఒంటరై
కంట తడిపెట్టే కనిపించే
విలపించి
క్షమతో కదిలిపోయే
ఒకే ఒక్క మనిషి

- సీతారాం

# వెంటాడుతున్న జ్ఞాపకం

ఎప్పుడూ ఏదో మరచి పోయానని జ్ఞాపకం వస్తూ ఉంటుంది. వెనక్కి తిరిగి చూసుకుంటే పారదర్శకంగా తేలుతున్న నీడ తరుముకొస్తూనే ఉంటుంది. రూపం నాలా ఉండదు. అదే అనుమానం. పోగొట్టుకున్నదేదో అవ్యక్తంగా తెరలమాటున పలకరిస్తూ ఉంటుంది. లోపలికి తొంగి చూసుకుంటే సగం తెగిన గుండె ఒంటి చేత్తో లబ్‌డబ్‌లు కొడుతూనే ఉంటుంది. శబ్దం నాదికాదు. అదే పీకులాట. కావచ్చు, నా కే సందేహాలు లేక పోవచ్చు. ఆకాశం వెనుక నీరుగారుతున్న ఏకాంతంలోనే నేనుండవచ్చు. ఆలోచన వెనుక ఈసురోమంటున్న శూన్యం లోనే నా జ్ఞాపకం మిలమిలమంటూ మెరిసిపోవచ్చు. కాదనేదేమీ లేదు. అవుననేదేమీ లేదు. కావచ్చు. జ్ఞాపకం మాత్రం వెంటాడుతూనే ఉంటుంది. మరపు తీరాలలో జారిపోయిన దీపం కోసం చీకట్లో సాలోచనగా వెతుక్కుంటూనే ఉంటాను. గడియారం ముల్లు

మీదుగా పాక్కుంటూ వెళ్లి ఒక కాలంక్రితం రాలిన మబ్బు తునకల్ని తడుముకుంటూనే ఉంటాను. అందరూ అంతే. ఎవరికీ మరచిపోయినది గుర్తుకు రావడం లేదు. కోల్పోయినది స్పర్శకు అందటం లేదు. అందరూ అంతే. గోడ మీద గొడ్డలిలా మొలుచుకొచ్చిన పిచ్చిమొక్కనడిగితే చెబ్తుంది. కిటికీ అంచున వాలి గదిలోకి అనుమానంగా తొంగిచూస్తున్న సూర్యుడి వేలికొసని అడిగినా చెబ్తుంది. మనమేదో మర్చిపోయాం. మనమేదో కోల్పోయాం. ఆ మాట గుర్తొస్తే మనసంతా జ్ఞాపకంతో తడిసిపోతుంది. రెప్పల కింద సముద్రం ఒకటి కెరటాలు కెరటాలుగా తీరం దాటుతుంది. చెక్కిలి అంచున కన్నీటి చుక్క ఒకటి ఒంటరిగా ఏడుస్తుంది. జ్ఞాపకాల తోటలో పూలన్నీ రాలతాయి. మరచిన దానిని మరిచామని మళ్ళీ మళ్లీ జ్ఞాపకం చేస్తాయి. నవ్వుకేం ఎప్పుడూ వస్తుంది. బాధకేం ఎప్పుడూ ఉంటుంది. మూగ జ్ఞాపకం మాత్రమే నోరు విప్పనిది. ఎండల మీదుగా నడిచివెళ్ళిన రెక్కలొచ్చిన మంచువానను అడుగుదామా కాసేపు. మనుషుల మధ్య గుణింతాలు నేర్చుకుంటున్న దూరాన్ని కొలుద్దామా కాసేపు. మబ్బుల కవతల శూన్యంలో వేలాడుతున్న మర్మకాంతిని పిలుద్దామా కాసేపు. పోనీలే --మరచిన దానిని గుర్తు చేయాల్సిన జ్ఞాపకం విచిత్రంగా మతిమరపును గుర్తు చేస్తున్నా--పోనీలే. ప్రతి అవయవాన్ని గాలిపటం చేసి ఒక్కో ఆకాశం లోకి ఎగరేస్తూ నాజూగ్గా ముక్కలు ముక్కలు చేస్తున్నా--పోనీలే. మనకీ జ్ఞాపకమన్నా మిగిలింది. దీన్ని పట్టుకు ముందుకెళదాం. పోగొట్టుకున్న దాన్ని కనుక్కోవటం కోసం. మరచిపోయినదాన్ని గుర్తు చేసుకోవడం కోసం. జారిపోయిన స్పర్శల్ని అందుకోవటం కోసం. వేలు మాత్రం విడవకు. నడక మాత్రం ఆపకు. ఎప్పుడూ ఏదో మరచిపోయానని జ్ఞాపకం వస్తూ ఉండాలి.

- త్రిపురనేని శ్రీనివాస్

# దూరం

ఎంతెంత దూరం కోసెడుకోసెడు దూరం
అంటూ ఆడుకున్న చిన్ననాడు
దూరమంటే ఏమిటో తెలీనే తెలీదు

అలిసే దాకా నడిచినా
అలసట తెలిసేదిగానీ
దూరం తెలిసేది కాదు

పక్కవాళ్లకీ మనకీ మధ్య
గొప్పలు తప్ప మరేమీ చెప్పుకోలేని దూరం

మనసుకీ మనసుకీ మధ్య
అనాత్మీయపు కంచుగోడల దూరం
తల్లితండ్రులకీ పిల్లలకీ మధ్య
వయో, తారతమ్యాల తారుపారల దూరం

మనిషికీ మనిషికీ మధ్య
వైరుధ్యాల చీలికగీతల దూరం

ద్వంద్వ ప్రమాణాల పితృస్వామికంలో
పెళ్ళికాని తల్లికి బిడ్డకీ మధ్య
మూగవేదనల కారుచీకట్ల దూరం

కొన్నేళ్ళుగా కాపురం చేస్తున్న భర్తకీ భార్యకీ మధ్య
మనసెరగని గానుగెద్దు దూరం

దూరం లేనిది
శరీరానికి శరీరానికి మధ్య మాత్రమే
పావలా ఇచ్చినా చాలు
సూత్రం తాడు కట్టినా చాలు

ఎంతో దూరాన వున్న తనకీ నాకూ మధ్య
కనీసం గాలి చొరబడటాని క్కూడా
ఖాళీ లేని ఈ దూరం అద్వైతదూరం

\- రేవతీ దేవి

# అంతా అంతే !

కాలంతో పాటు కాకినాడ మారినట్టే
జ్ఞాపకాలూ మారిపోతాయి!
భావనారాయణుడి గుళ్ళో
నిశ్చింతగా గూడు కట్టిన పక్షులు
వరికంకుల కోసం పోయి పోయి
వరదలో చిక్కుకున్నట్టు
అంతా అంతే!

వెక్కిరించాడంటే సమాజాన్ని
వెంకటచలానిదా తప్పు?

నేరేడు చెట్టుకింద పళ్ళేరుకుందికి
పందెం వేసుకుని పరుగులు పెట్టిన
కాలేజీ అమ్మాయిలు ఎందరో
నవ్వులన్నీ ఇగిరిపోయి
ఉప్పుమళ్ళై పేలిపోయి వంట రుచుల్లో కరిగిపోయారు!

వెయ్యిగా వెయ్యిగా గులకరాళ్లు
నీళ్ళెప్పటికో పైకొస్తాయని
వెతుకుతూ వెతుకుతూ వెర్రికాకులమై
ఎండపడ్డ కలలతో
ఎంత దాహంతో ఉన్నాం! ఏమైపోతున్నాం!

మామిడితోటలొదిలేసి
ఇసక మేటలొదిలేసి
ఓ అయ్య చేతిలో పెట్టి
ఇల్లు కట్టుకోమన్నారని కదా
ఇంత దూరాలొచ్చేసాం!

ఏం చేస్తున్నారంటే
పిల్లలతో గిన్నెలతో
మీరు మాత్రం ఏం చెప్తార్లెండి!
మన ఆశలు కాలువగట్టు పొలాలు కావుగా
ఏటి పొడవుతా పచ్చగా ఏదో ఒకటి పండటానికి!
మరెలాగంటే చెప్పలేం!
పొడుపు కథలు విప్పలేం!

ఏమీ తెలియనితనంలో ఎంత సుఖం!
సపోటా చెట్లమీద చదువుల సన్నాహాలు
సర్పవరం పూతోటల్లో పుప్పొడి సరాగాలు
ఏమర్రా!
చండామార్కుల వారింకా ట్యూషన్లే చెబుతున్నారా?
మెక్లారిన్ హైస్కూలు మలుపులూ!
గోదావరి కాలవదాటి
పాత జగన్నాథపురంలో
తాతలనాటి సందులూ!
వెంటబడిన కుర్రాళ్ళని చూసి వెక్కిరింతలూ
కంటికొనల కవ్వింతలూ కేరింతలూ!

అంతేలే!
పారిపోయిన పదహారోఏడు మరి తిరిగిరాదు!
తన పని తాను చేసుకుంటూ
బల్లకట్టు మాదిరి
ఆ గట్టూ ఈ గట్టూ తిరుగుతుంది జీవితం!

తొలి యవ్వనం మళ్ళిపోయింది!
కాలంతోపాటు కాకినాడ మారినట్టే
జ్ఞాపకాలూ మారిపోయాయి!

– జయప్రభ

# స్నేహరాహిత్యం

ఇంత దూరం పెరిగిందనే
నిజం చెప్పేందుకు
ఏ మైలు రాయీ లేదిక్కడ
తలుపులు బిగించుకున్న తలపులతో
స్నేహపూర్వకంగా చూపు కలపడం కష్టం కనక
ఎవరి చీకట్లోంచి వారే

తమ నిష్క్రియతా సమాధి స్థితికి
తగినన్ని కారణాలు సిద్ధం చేసుకుంటాం
ప్రత్యర్థిని తప్పుదారి పట్టించేందుకు

సడిలేని కన్నుల తడిలేని
శ్మశాన ప్రశాంతతను పొడిగించేందుకు
రాజీదారి సంభాషణ లేవో వుండనే వున్నాయి
తప్పనిసరితనం పొడిగించేందుకు

పోస్టుకార్డు ధర పెరిగిందనో
టెలిఫోన్ తీగ తెగిందనో
ఎండ వేడిగా వుందనో
ముల్లు వాడిగా వుందనో
అభిప్రాయ భేదాల్లేవు
ఆలోచనల్లేవు కనక

నమ్ముకున్న విలువల్నీ అనుభూతుల్నీ వదిలి
ఆది మానవుడి పరిమిత శక్తులైన
ప్రాథమిక శరీర అవసరాల పూరణే
జీవితమనిపిస్తుంది
ఈ వాస్తవం ఘనీభవించదు
పోనీ గుండె పగిలి ద్రవించదు
ఇది విషాదమనో విషనాదమనో
మనసు తాకని అర్థాలు అద్భుతీకరించి
వాక్యాల విస్తీర్ణతని ఆక్రమించడం తప్ప
ఏం చెయ్యాలో తోచదు

\- కొండేపూడి నిర్మల

# మోహాలకీ... ప్రవాహాలకీ వేగం లేదు

సందడంతా అణగిపోయిన రాత్రి
చలిబారిన స్వప్నం
ఆకురాలు అరణ్యాల సామూహిక శోకం
నా ఏకాంతం!
చెట్ల బెరళ్లలాగే నరాలూ చిట్లిపోతాయి
దిగుళ్లనించి తప్పించుకుని
ఏ టెలిగ్రాఫ్ తీగల్లోంచో
విడిపోయిన శబ్దంలా
సంకేతం వస్తుందేమోనని!
నిశ్శబ్దం ఒక్కోసారి
మోసమో... దైన్యమో అర్థంకాదు
అంతా స్తంభించిపోయిన వాతావరణంలో
మోహాలకీ... ప్రవాహాలకీ వేగం లేదు
కాగితంమీద
అక్షరాల నిప్పురవ్వలు రాలవు
చర్మంమీద చుంబనాల ముద్రలేర్పడవు
ఎంతకీ తరగని రాత్రి
అణుచుకునే కోర్కెలకీ
ఆకురాలిన వృక్షాలకీ
కొత్త చిగుళ్లెక్కడివీ?

– జయప్రభ

# మజిలీ

అడవి
అందంగా అమానుషంగా వుంది!
చిక్కగా చీకటిగా
పచ్చగా, చల్లగా...
అడవి దట్టంగా అల్లుకుపోయింది
అయినా ఇక్కడ
చీమలు వేసిన బాటలున్నాయ్!
శతాబ్దాల నిశ్శబ్దాన్ని
పొదివిన మౌనపు

కొండలున్నాయ్
అది ఋతువు ఋతువుకూ
రకరకాల రూపాలు ధరిస్తుంది
ఇప్పుడు చూడు -
పల్చటి పచ్చవస్త్రం
కప్పుకుని
రా, రమ్మని పిలుస్తుంది
కొన్నాళ్ళయ్యాక రా!
చలికి వెలిసిపోయి
దిగులుగా ముడుచుకుని
కూర్చుంటుంది -
నన్ను విషాదంలో
ముంచుతూ ...
ఇక ఇప్పుడొచ్చావా,
నేస్తం -
గ్రీష్మం గాలి
అడవి అందమైన
ముసుగు లాగేసి
పరుగెత్తుతుంది
ఎత్తైన వృక్షాలు
కొమ్మల చేతుల్నెత్తి
విలపిస్తున్నాయి
ఈ వృక్షపు ఎడారి
నీకు ఊపిరాడనివ్వదు మరి

అడవి
పగలు పచ్చగా
పక్షుల పాటలతో

ఆహ్లాదాన్నిస్తుంది -
అదే రాత్రి
చీకటి కాటుక పెట్టుకుని
నల్లగా నిర్దాక్షిణ్యంగా
కనపడుతుంది
అడవి
తన వెచ్చటి వాడిలో
మనల్ని ఆడిస్తుంది
లాలిస్తుంది
అడవి
తన నరహంతక మొక్కల్తో
మనల్ని నవిలేస్తుంది కూడా!
బండరాళ్లమీంచి
పారే సెలయేళ్లు
ఎన్నెన్ని వూర్ల
విషాదానందాశ్రువుల్నో
మోసుకొస్తాయి
నేస్తం...
మాకు తెల్సులే
హద్దుల్ని బద్దలు
కొట్టాలనే మీ ప్రయత్నం
మనల్ని మింగజూసే
క్రూర జంతువులతో
లోనా, బయటా
మన ప్రతిఘటన అని
వీచే గాలి
వార్తల్ని మోసుకొస్తుంది
ప్రతి పంటచేనూ

రక్తంతో పచ్చబడిందనీ
ప్రతి ఫ్యాక్టరీ
పొగ గొట్టంనుండి
పైకి లేచేది
మీ ఊపిరేనంటూ
మనిషి మనిషిగా
బ్రతకడానికై
అడవిబైట
మీరంతా చేస్తున్న ప్రయత్నాలు
ఉక్కు పాదాల క్రింద
నలిగిపోతున్న దేహాలు
అయినా ఇంకా బిగియించే వున్న
పిడికిళ్ళు -
మాకు తెలుసులే నేస్తం!

అడవిలో
అక్కడక్కడా
పసిపాపలు ఆహుతైనా
అన్నల్ని రక్షించే
గురజలమోడులాంటి
గూడేలు - తండాలు
శత్రువు గుండ్లని
నిశ్శబ్దంగా భరించే
గురిమెళ్లా, పగిడేరు
పాండవుల గుట్టలు
లేకుంటే
మేం ఇక్కడ
నిలబడగలిగేవాళ్లం

కానే కాము
ఆప్రక్కనే
పావురాళ్ళ గుట్టా...
పులి విసిరిన పంజాదెబ్బకి
నెత్తురు చిందించిన
చీకటి గుండ్ల
ములుగు చుట్టూ...
నేస్తం -
అయినా మరేం
ఫర్వాలేదు
ఎండాకాలం
అడవిలో
ఎరగళ్ళు పడితేనేం?
తిరిగి అది
పచ్చ సముద్రం అవుతుంది

ఎగిరి ఎగిరి
మోదుగు చెట్టు
మీద వాలిన పక్షి పిల్ల
ఎర్ర మోదుగు పూవుల్ని
ప్రశ్నిస్తుంది
ఇక్కడ మీరేం
చేస్తున్నారని!
దేవదారు గుబురు
రేపటి కోసం
తన ఎర్రని విత్తనాల్ని
రాలుస్తుంది

నేస్తం!
అడవి బయట
మీ ప్రయత్నాలు
మాకు తెలుసులే!
మేం వస్తాం
నాగేటిచాళ్ళ మీదుగా
నగరాల్లోకి
మమ్మల్ని కొంచెం
నిలద్రొక్కుకోనివ్వండి
ఇక్కడ రాలిన విత్తనాల్ని
కాస్త మొలకెత్తనివ్వండి
మోదుగుల్ని మరింత
వికసింప నీయండి

అందాకా -
అడవి ఎంత
అందంగా అమానుషంగా
వున్నా సరే.. తప్పదు మరి
అది ఎంత
చీకటిగా, నిర్దాక్షిణ్యంగా
వున్నా సరే...
అయినా అడవి
అటే ఆకర్షిస్తుంది
నేస్తం
అడవి అటే ఆహ్వానిస్తుంది

- విమల

# కవి పరిచయం

## శ్రీరంగం నారాయణబాబు (1906-1962)

పుట్టిన ఊరు విజయనగరం. తెలుగు, ఇంగ్లీషు భాషలతో సునిశిత పరిచయం వుంది. సంగీతంలో ప్రవేశం వుంది. నాట్యరంగ పరిచయం కూడా వుంది. 'రుధిరజ్యోతి' కవిత్వ సంపుటి ప్రధాన రచన. తెలుగు కవిత్వానికి కొత్త తళుకులు అద్దాలనే ప్రయత్నంలో రూపం కంటే భావానికెక్కువ ప్రాతినిధ్యమిచ్చిన కవి. పొడి మాటలతో తన భావాలకు కవిత్వ రూపమివ్వదలచిన ప్రయోగశీలి. భావకవిత్వానికీ, అభ్యుదయ కవిత్వానికీ మధ్య లోలకం మాదిరి ఊగులాడిన చిత్తప్రవృత్తి. చాలాకాలం మద్రాసులో నివాసం.

## శిష్ట్లా ఉమామహేశ్వరరావు (1909-1953)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా మంచాళ అగ్రహారం. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంనుంచి ఇంగ్లీషు సారస్వతంలో ఎం.ఎ. పట్టభద్రులు. కొంతకాలం మిలటరీలో ఉద్యోగం చేశారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనడం ద్వారా స్వాతంత్ర్య సమరయోధుడు. సంగీతం, జ్యోతిషం అభిమాన విషయాలు. కొంతకాలం అధ్యాపక ఉద్యోగంలో ఉన్నారు. 'విష్ణుధనువు', 'నవమి చిలుక' కవిత్వ సంపుటాలు ప్రధాన రచనలు. శ్రీశ్రీ స్మారక సంస్థ 1998లో కవిత్వ సమగ్ర సంపుటి ప్రచురించింది. అంతకు ముందే విజయవాడ నవోదయ సంస్థ 'సిపాయి కథలు' అనే పేరిట కథల సంపుటి ప్రచురించింది. కవిత్వంలో 'తిరుగుబాటు మా సిద్ధాంతం' అనే ధోరణి ప్రముఖంగా కనిపిస్తుంది. మహావేశపరుడనీ, అరాచకత్వం ఈయన ముడిసరుకనీ చెప్పాలి. వెటకారం ఎక్కువ. కవిత్వపు సంయమనం తక్కువ. బాగున్న కొద్దిపాటి కవిత్వమూ కాకతాళీయంగా పలికినదని స్పష్టం.

## శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) (1910-1983)

పుట్టిన ఊరు విజయనగరం. పట్టభద్రులు. కొంతకాలం పత్రికలలో ఉపసంపాదకులుగా ఉద్యోగం. అనంతరం చాలా కాలం సినిమారచన. కవిత్వం ఆయన 'కోట' అయినా కథలు, రేడియో నాటకాలు, సాహిత్య వ్యాసాలు, చాలా వ్రాశారు. 1971 లో షష్టి పూర్తి సందర్భంగా అప్పటి వరకు గల రచనలను శ్రీశ్రీ షష్టి పూర్తి సన్మాన సంఘం సమగ్ర సంపుటాలుగా ప్రచురించింది. అభ్యుదయ సాహిత్యోద్యమ నాయకులు. విప్లవ రచయితల సంఘం అధ్యక్షులు. సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు పొందారు. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత. ఆధునిక యుగంలో తెలుగు కవిత్వానికి కొత్త ఇతివృత్తం, పలుకుబడి అలవరచిన యుగకర్త . 'మహాప్రస్థానం', 'ఖడ్గసృష్టి' కవిత్వ సంపుటులు ప్రముఖ రచనలు.

## తెన్నేటి సూరి (1911-1958)

పుట్టిన ఊరు కృష్ణాజిల్లా తెన్నేరు. బందరు నోబెల్ కళాశాల నుంచి పట్టభద్రులు. ఆంధ్రపత్రిక, భారతి సాహిత్యపత్రికలలో ఉపసంపాదకులుగా పనిచేశారు. 'చెంఘిజ్‌ఖాన్' నవల, 'సాహిత్య సమవాకారం' వ్యంగ్య రూపకం, రెండు మహానగరాలు (అనువాద రచన) వీరి ప్రధాన రచనలు. వీణ, బూరెముక్కలు - అనే రెండు కథలు, కొద్ది గీతాలు, సాహిత్య సమవాకారం కలిపి 'మహోదయం' పేరిట 1959లో తెన్నేటి పబ్లికేషన్స్‌వారు ఒక సంపుటి వెలువరించారు. దోపిడీని, మూఢవిశ్వాసాలను, నిష్క్రియత్వాన్నీ నిరసించిన రచయిత ఈయన. భావస్పష్టత, లక్ష్య స్పష్టత, కళాత్మకత కలసిన అరుదైన కవి. కవిత్వం పేరిట వ్రాసినది తక్కువైనా, యీ లక్ష్యశుద్ధి ఆయన కవిత్వాన్ని జీవత్‌జ్వాలగా చేసింది.

## పఠాభి (1919)

అసలు పేరు తిక్కవరపు పట్టాభిరామరెడ్డి. పుట్టిన ఊరు నెల్లూరు. న్యూయార్కు

కొలంబియా విశ్వవిద్యాలయంనుంచి ఇంగ్లీషు సారస్వతంలో ఎం.ఎ. పట్టభద్రులు. చలన చిత్ర నిర్మాత, దర్శకులు. 1970లో కన్నడంలో 'సంస్కార' చిత్రాన్ని నిర్మించారు. లొకార్నో, మన్‌హైమ్ చలనచిత్రోత్సవాల్లో ఈ చిత్రానికి బహుమతులు వచ్చాయి. మన దేశంలో ఈ చిత్రానికి 1970లో రాష్ట్రపతి స్వర్ణపతకం లభించింది. లభించిన ఇతర గణనీయ పురస్కారాలు: కర్నాటక రాజ్యోత్సవ పురస్కారం, హైదరాబాద్ అమృతోత్సవం, ఫిడేలు రాగాల డజన్, కయిత నా దయిత, పఠాభి పంచాంగం ప్రధాన రచనా సంపుటాలు. గణితశాస్త్రం అభిమాన విషయం. కవిత్వ రచనలో కొంటె కోణంగి. ఛందస్సుల నడుం విరగ్గొడతానన్న పఠాభికి ఛందస్సు మీద, భాష మీద అపారమైన అధికారం వుందని 'కయిత నా దయిత' సంపుటంలో రచనలు నిరూపిస్తాయి. అర్బన్ పొయిట్రీ'కి శ్రీకారం చుట్టిన తొలి ఆధునిక కవి. వ్యంగ్య, చమత్కారాలు ఈయన కవిత్వానికి ప్రాణాలు. లోతైన భావుకుడు. ఏ అరమరికలు లేకుండా మనిషితనాన్ని ప్రేమించినవాడు. లస్ట్‌ఫర్ లైఫ్ - అనేది ఈయన జీవన సూత్రంగా కనిపిస్తుంది. ప్రస్తుత నివాసం బెంగుళూరు.

## రెంటాల గోపాలకృష్ణ (1920-1995)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా పలనాడు తాలుకా రెంటాల గ్రామం. నరసరావుపేట, గుంటూరుల్లో హైస్కూలు, కాలేజీ చదువులు. గుంటూరులో బి.ఎ. డిగ్రీ చదువుతూ సహాయ నిరాకరణోద్యమంలోకి ప్రవేశించారు. 1943 నాటికే విజయవాడ వచ్చి స్థిరపడినా, 1960నుంచి ఆంధ్రప్రభ దినపత్రికలో చేరి దాదాపు 30 ఏళ్లు పనిచేశారు. 'సంఘర్షణ', 'సర్పయాగం', 'శివధనువు' కవిత్వ సంపుటాలు, 'ఇన్‌స్పెక్టరు జనరల్', 'అంతా పెద్దలే' నాటకాలు ప్రధాన రచనలు. నాటక రచయితగా ప్రజానాట్యమండలి, ఆంధ్ర ఆర్ట్స్ థియేటర్స్‌తో సన్నిహిత సంబంధాలున్నాయి. 1943లో ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డాక అందులో ప్రముఖ పాత్ర వహించారు. రకరకాల ప్రక్రియల్లో, సంప్రదాయ, సంప్రదాయేతర రచనలు 180 దాకా ప్రచురించారు. 1979లో ఆంధ్ర నాటక పరిషత్ అవార్డు, 1981లో నెల్లూరు నెఫ్జా నాటక కళా పరిషత్

అవార్డు, 1995 లో 'క్రాంతి' ఉత్తమ జర్నలిస్టు అవార్డు ప్రధాన పురస్కారాలు. అభ్యుదయ కవిత్వోద్యమం ఆశించిన 'కవిత్వ ప్రచారా'న్ని రెంటాల కవిత్వం పుష్కలంగా చేసింది. వచన కవిత్వ ప్రక్రియకు దిగకుండా – ప్రధానంగా గేయ ప్రక్రియకే కట్టుబడిన తొలితరం అభ్యుదయ కవి ఈయన.

## దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921-1966)

పుట్టిన ఊరు పశ్చిమగోదావరి జిల్లా తణుకు. మద్రాసులో చదువు చదివినా – డిగ్రీలు లేవు. ఇంగ్లీషు, తెలుగు భాషల్లో గాఢ సాహిత్య పరిచయం వుంది. గోరువంకలు (పద్యాలు), 'అమృతం కురిసిన రాత్రి', తిలక్ కథలు, సుప్తశిల, సుచిత్ర ప్రణయాం, సుశీల పెళ్లి నాటికలు ప్రధాన రచనలు. తణుకులోనే 'సాహితీ సరోవరం' అనే చిన్న సాహిత్య సంస్థను కొద్దికాలం నిర్వహించారు. కవిత్వం, సంగీతం, అంటే ప్రాణం పెట్టే సున్నితమైన మనస్సు. తన కవిత్వం ద్వారా, కథల ద్వారా, మనిషి అంతరంగాన్ని విశ్లేషించిన అరుదైన సమర్థుడు. వచన కవిత్వానికొక భావ పరిమళాన్ని, అనుభవవాహకత్వాన్నీ సమకూర్చిన ప్రశస్తకవి. 'అటు కృష్ణశాస్త్రి థీసిస్‌కీ, శ్రీశ్రీ యాంటీథీసిస్‌కీ నడుమ సింథసిస్ తిలక్ ' అని శ్రీ నండూరి రామమోహనరావు చేసిన వ్యాఖ్య తగిన విశ్లేషణ. తిలక్ మరణానంతరం మాత్రమే ఆయన పుస్తకాలు ముద్రణ కావడం వల్ల – 1971 లో 'అమృతం కురిసిన రాత్రి'కి ఇచ్చిన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రధాన పురస్కారం.

## కుందుర్తి ఆంజనేయులు (1922-1982)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా కోటవారిపాలెం. విజయవాడలో, గుంటూరులో విద్యాభ్యాసం. పట్టభద్రులు. 1944 నాటి నయాగరా కవులలో ఒకరు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమాచార శాఖలో ఉద్యోగం చేశారు. తెలంగాణా కావ్యం, యుగేయుగే, నాలోనినాదాలు, నగరంలో వాన, హంస ఎగిరిపోయింది సంపుటాలు ప్రధాన రచనలు. వచన కవిత్వ విధానంతో నాటక రచనలో ప్రయోగాలు చేశారు. హైదరాబాద్ ఫ్రీవెర్స్ ఫ్రంట్ వ్యవస్థాపకులు. ఆ కారణంగా వచనకవితా పితామహులు. 'కుందుర్తి కృతులు' పేరిట వీరి సమగ్ర కవిత్వ సంపుటం

చాలాకాలం క్రిందటే వెలువడింది. 1969లో సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు, 1977లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రముఖ పురస్కారాలు. ఈయన ఉద్యమ దీక్షతో, వచనంలో కవిత్వ రచన చేసిన కవి. భావసరళత, భాషా సరళత, లక్ష్య స్పష్టత గాఢంగా కోరారు. సమకాలీనత కావాలని పట్టుపట్టారు. ఆత్మాశ్రయ ఖండకృతిలో పునరుక్తులకు అవకాశమెక్కువని నమ్మి, వచన కవిత్వ ప్రక్రియలో పెద్ద కావ్యాలు రావడమవసరమని వాదించారు. తాను మంచి భావుకుడైనా, కవిత్వంలో లక్ష్యశుద్ధికే మొదటి తాంబూలమిచ్చారు. ప్రాచీన కవులలో శతకకారుల కుండే నిసర్గ భావ వ్యక్తీకరణ విధానంతో ఈయన భావ ప్రకటన విధానాన్ని పోల్చవచ్చు.

## అనిసెట్టి సుబ్బారావు ( 1922- 1979)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా పురుషోత్తమపట్నం. పట్టభద్రులు. నవ్యసాహిత్య పరిషత్తు కార్యవర్గంలో, 'ప్రతిభ' సంపాదకవర్గంలో సభ్యులు. ఆ తరవాత ప్రజాశక్తి, అభ్యుదయ సంపాదకవర్గ సభ్యులు. దక్షిణ భారత సినిమా రచయితల సంఘానికి ప్రధాన కార్యదర్శి. ఆంధ్ర అభ్యుదయ రచయితల్లో ప్రముఖులు. అగ్నివీణ, బిచ్చగాళ్ల పదాలు, అనిసెట్టి కథలు, గాలివేడలు, మావూరు నాటకాలు ప్రధాన రచనలు. దాదాపు పాతిక సంవత్సరాలు సినిమా రంగంలో రచయితగా పనిచేశారు. కారుణ్యం, ప్రబోధం అనిసెట్టి రచనల్లో ప్రధాన లక్షణాలు. శాస్త్రీయ సామ్యవాద విప్లవాభిముఖంగా శ్రామికుల్ని మేలుకొల్పడం ఆయన ధ్యేయం.

## అబ్బూరి వరదరాజేశ్వరరావు (1923-1993)

పుట్టిన ఊరు మద్రాసు. అసలు ఊరు గుంటూరు జిల్లా తెనాలి దగ్గర జెముడుపాడు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎ. పట్టభద్రులు. 1963లో అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో భారతీయ సాహిత్యంలో ఆచార్య పదవి నిర్వహించారు. న్యూఢిల్లీలోని అల్లైడ్ పబ్లిషర్స్‌లో ఎడిటర్-ఇన్- ఛీఫ్‌గా పనిచేశారు. 'అందాక', 'కవన కుతూహలం', 'వరదకాలం', 'నాట్యగోష్ఠి' నాలుగు నాటకాలు',

'కవితా సంచిక', 'సామిధేని' ప్రధాన రచనలు. 1958లో 'మోడరన్ ఇండియన్ పొయి ట్రీ' సంకలనానికి సంపాదకత్వం వహించి ప్రచురించారు. 1993లో కొద్ది కాలం ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘానికి అధ్యక్షులుగా ఉన్నారు. స్వభావతః ఈయన ప్రయోగశీలి. ఛందస్సుకు, కవిత్వానికి అవినాభావ సంబంధముందని నమ్మిన కవి. ప్రశస్తమైన మానవతా దృక్పథాన్ని అనుసరించారు. కవితా హృదయ ధర్మం ఎరిగిన అరుదైన కవిత్వ పిపాసి.

## ఆవంత్స సోమసుందర్ (1924)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా లోని శంఖవరం. కాకినాడలో పిఠాపురం రాజా కాలేజీలో చదివారు. చాలా చిన్న వయస్సు నుంచి సాహిత్య వ్యాసంగం ప్రారంభించారు. 1941 ప్రాంతాల భావకవిత్వాన్ని అభిమానించినా, 1944 నుంచి అభ్యుదయ కవి పరంపరలో చేరారు. కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా 1947-48 జైలుశిక్ష. వజ్రాయుధం, రక్తాక్షి, కాహళి, సోమరసం, సుందరకాండ, మేఘరంజని, వెన్నెలలో కోనసీమ, ఒక్కకొండలో వేయి శిల్పాలు, ఆంగ్లసీమలో ఆమని వీణలు ప్రధాన కవిత్వ రచనలు. 'బానిసలదేశం' కథల సంపుటి, ఇంకా మరికొన్ని విమర్శ గ్రంథాలు ప్రచురించారు. కళాకేళి పత్రికకు సంపాదకత్వం, కళాకేళి ప్రచురణల నిర్వహణ ప్రత్యేకించి చెప్పదగినవి. 1993లో తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ పురస్కారంగా అందచేసిన గౌరవ డాక్టరేటు, ప్రపంచ తెలుగు మహాసభ సన్మానం, సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు ప్రధాన పురస్కారాలు. ప్రస్తుతం తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో నివాసం. ఈయన భావకవితా హృదయ ధర్మంతో అభ్యుదయ కవిగా పరిణమించిన వ్యక్తి. భావ ప్రకటనంలో 'ప్రకటన' లక్ష్యం, లక్షణం ఎక్కువ. పోలిక చెప్పాలంటే 'పూర్ణం' సామ్యవాద సంబంధి. 'పూత' భావ కవిత్వ సంబంధి. ఈ లక్షణం తొలినాటి కవిత్వంలో కంటె, రాను రాను పెరిగింది. మంచి కవిత్వం వింటే, ప్రాణం పెట్టే మనస్వి. రాశి, వాసి– 'వాసి' కంటె 'రాశి'ని పెంచారని ఒక అభిప్రాయం. అభ్యుదయ కవిత్వోద్యమంలో 'చురుకుగా' పాల్గొని – అంకిత భావంతో రచన చేసిన వారిలో సోమసుందర్ అగ్రగణ్యులనేది తిరుగులేని నిజం.

## ఆరుద్ర (1925-1998)

అసలు పేరు భాగవతుల శివశంకరశాస్త్రి. పుట్టిన ఊరు విశాఖ జిల్లా యలమంచిలి. విశాఖపట్నం ఎ.వి.ఎన్. కాలేజీలో చదువు చాలించి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. విమాన దళంలో కొంతకాలం ఉద్యోగం చేసిన అనంతరం 'ఆనందవాణి' పత్రికకు సంపాదకత్వం వహించారు. 1949లో సినిమారంగ ప్రవేశం. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం సభ్యులు. త్వమేవాహమ్, సినీవాలి, గాయాలు - గేయాలు, కూనలమ్మ పదాలు, ఇంటింటి పజ్యాలు, ఏటికేడాది ప్రధాన కవిత్వ సంపుటాలు. షష్టిపూర్తి సందర్భంగా 1985 లో ఆయన రచనల సంపుటాలు సమగ్రంగా వెలువడ్డాయి. 13 సంపుటాలలో వెలువరించిన సమగ్రాంధ్రసాహిత్యం పేరిట సాహిత్య చరిత్ర ఆయన పరిశోధనాశక్తికి నిదర్శనం. ఇవికాక -కొన్ని వందల వ్యాసాలు రేడియో నాటికలు, డిటెక్టివ్ నవలలు, కథలు, సినిమా రచనలు వున్నాయి. అపురూప విషయాలు సేకరించాలని ఆయన పట్టుదల. ఏది పలికినా మారువడిగా, కొత్తగా, అత్యంత ఆధునికంగా పలకాలని ఆరుద్ర వ్యక్తిత్వ ప్రపత్తి. చివరంటా సామ్యవాద సిద్ధాంత విశ్వాసి. గొప్ప కవిత్వపు లోతులెరిగిన రసహృదయుడు. కొత్త పలుకు ఎక్కడ వున్నా మోకరిల్లే మనస్వి. తెలుగు కవిత్వంలో అంతగా సంస్కృతం వాడగా లేనిది ఇంగ్లీషు పదాలు కలిపి వాడితే యేం? అని నమ్మిన సర్వస్వతంత్రుడు. హాస్య, వ్యంగాల ఊతంతో, సామ్యవాద తత్త్వాన్ని ప్రవచించాలని, శిల్పం లేనిది కవిత్వం కాదని గాఢంగా నమ్మిన అత్యాధునిక కవి. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇచ్చిన డాక్టరేటు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రధాన పురస్కారాలు.

## ఆలూరి బైరాగి (1925-1978)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా తెనాలి తాలుకా ఐతానగర్. బీహార్ రాష్ట్రం వెళ్లి హిందీ భాషలో విద్యాభ్యాసం చేశారు. రాడికల్ హ్యూమనిస్టు పార్టీ సభ్యులు. పిల్లల పత్రిక హిందీ 'చందమామ'కు కొంతకాలం సంపాదకులుగా పనిచేశారు. చీకటి నీడలు, నూతిలో గొంతులు, ఆగమగీతి ప్రధాన కవిత్వ సంపుటాలు. ఈయన

కవిత్వంలో వ్యక్తి ఆర్తి, సందిగ్ధత ప్రధానాంశాలు. చాలా మందికి కొరుకుడు పడని మనిషి అంతరంగ విశ్లేషణ, పద చిత్రాలు, భాషారీతి ఈయనను పాఠకుడికి దగ్గర కావలసినంతగా కానివ్వలేదని ఒక అభిప్రాయం. బైరాగి భావకవుల్లో అత్యాధునికుడు. అభ్యుదయ కవుల్లో ఇమడజాలని భావకవి.

## దాశరథి (1927-1987)

పూర్తిపేరు దాశరథి కృష్ణమాచార్యులు. పుట్టిన ఊరు వరంగల్ జిల్లా చిన్నగూడూరు. పట్టభద్రులు. సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషల్లో కోవిదులు. హైదరాబాద్, మద్రాసు ఆకాశవాణి కేంద్రాల్లో ప్రయోక్తగా ఉద్యోగం చేశారు. తెలంగాణా స్వాతంత్ర్య సమరకాలంలో జైలుశిక్ష అనుభవించారు. అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు, కవితాపుష్పకం, అమృతాభిషేకం ప్రధాన కవిత్వ సంపుటాలు. ఆయన గాలిబ్ గీతాలకు చేసిన అనువాదం 'ప్రశస్త'మని అభినందనలు పొందింది. కొంతకాలం సినిమాలకు పాటల రచన చేశారు. తెలుగు పద్యానికి పారశీక కవన పరిమళాలను అద్దిన అపురూప పద్యకవి ఈయన. వచన కవిత్వ ప్రక్రియలో కూడా తమ కవిత వెలయించారు. పద్యచ్ఛందం, ముక్తచ్ఛందం, రెండింటిలో అంగారం, శృంగారం పలికించిన విద్వాంసుడు. వక్త. మానవతామూర్తి. ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ, ఆగ్రా విశ్వవిద్యాలయం డాక్టరేటు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రధాన పురస్కారాలు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఆస్థానకవిని చేసి, గౌరవించింది. దాశరథి ప్రశస్త కవిత్వ హృదయం పద్యంలో పలికినంత హృద్యంగా వచన కవిత్వ ప్రక్రియలో పలకలేదని ఒక అభిప్రాయం. తెలంగాణా రచయితల ఉద్యమంలో అగ్రగామి దాశరథి. 'రుబాయీ' ఛందాన్ని సొగసుగా తెలుగులోకి ఒదిగించిన ప్రయోగశీలి ఈయన.

## గుంటూరు శేషేంద్రశర్మ (1927)

పుట్టిన ఊరు నెల్లూరు జిల్లా ఉదయగిరి తాలూకా నాగరాజుపాడు. గుంటూరు ఎ.సి. కాలేజీ నుంచి పట్టభద్రులు. మద్రాసు లా కాలేజీ నుంచి 'లా'

డిగ్రీ . ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో మున్సిపల్ కమీషనరుగా పనిచేసి, పదవీ విరమణ చేశారు. నా దేశం – నా ప్రజలు, మండే సూర్యుడు, గొరిల్లా, సముద్రం నా పేరు, కవిసేన మేనిఫెస్టో, రక్తరేఖ, స్వర్ణహంస, కాలరేఖ, షోడశి, ఆధునిక మహాభారతం, జనవంశమ్ ప్రధాన రచనలు. భారత ప్రభుత్వ 'రాష్ట్రేందు' బిరుదం, కలకత్తా రాష్ట్రీయ హిందీ అకాడమీ అవార్డు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు ముఖ్య పురస్కారాలు. కవిత్వంలో, సాహిత్య విమర్శలో విలక్షణులు. ప్రపంచ సాహిత్యం మీద, భారతీయ సాహిత్యం మీద సాధికారిక పరిచయం. సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషల్లో పండితులు. వచన కవిత్వం, పద్య రచన – రెండింటి సమాన ప్రతిభావంతులు. ఆధునిక కవిత్వంలో విలక్షణ ఊహాశాలిత ఈయన ప్రత్యేకత. వచన కవిత్వానికి ఒక కొత్తవాకిలి తెరిచిన స్వతంత్రులు. బహిరంతర ప్రకృతులకు తమ రచన ద్వారా వ్యాఖ్యానం పలికిన దార్శనిక కవి. ఒకానొక శైలీ నిర్మాత.

## ఇస్మాయిల్ (1928)

పుట్టిన ఊరు నెల్లూరుజిల్లా కావలి. బి.ఎ. ఆనర్స్ పట్టభద్రులు. కళాశాల అధ్యాపకులుగా పనిచేసి – పదవీవిరమణ చేశారు. చెట్టు నా ఆదర్శం, మృత్యువృక్షం, చిలకలు వాలిన చెట్టు, రాత్రి వచ్చిన రహస్యపువాన, బాల్చీలో చంద్రోదయం, కప్పల నిశ్శబ్దం, రెండో ప్రతిపాదన ప్రధాన కవిత్వ సంపుటాలు. కవిత్వంలో నిశబ్దం, కరుణ ముఖ్యం సాహిత్య వ్యాస సంపుటాలు. పురస్కారాలను తిరస్కరించారు. కవిత్వంలో అనుభవ పరిపాకానికి అగ్ర ప్రాధాన్యం ఇచ్చిన అరుదైన కవి. జీవితాన్ని ఇంతగా ప్రేమించిన కవి బహుశా చాలా తక్కువగా కనిపిస్తాడు. ఈయన పదచిత్రాలు గొప్పవి. కవిత్వంలో క్లుప్తత, నిర్భీకత, సరళత ఈయన ప్రత్యేక లక్షణాలు. ఆకాశం కింద పచ్చని చెట్ల తోపుల్లోకి, వానల్లోకీ, ఇంకా అపురూప దృశ్యాల్లోకీ పాఠకుణ్ణి చేయిపట్టుకు నడిపించగల కవితా సకల జగన్మిత్రుడు. జీవితంమీద ప్రేమ కలిగించే కవిత్వమీయనది. 'ఇజా'లన్నీ తరచి చూసినా, 'ఇజాతీతుడు'. ఈయన కవిత్వానికొక మానవపరిమళం వుంది.

## కె.వి. రమణారెడ్డి (1928-1998)

పుట్టిన ఊరు నెల్లూరు జిల్లాలో రేబాల. చరిత్ర, రాజనీతి శాస్త్రాలలో ఎం.ఎ. పట్టభద్రులు. కావలి జవహర్ భారతి కళాశాలలో అధ్యాపకులుగా పనిచేశారు. అడవి, భువనఘోష, అంగారవల్లరి, ఎర్రపిడికిలి, జైలులో కోకిల, సూరీడు మావోడు కవితా సంపుటాలూ, కవికోకిల, మహోదయం విమర్శ గ్రంథాలూ, రాజీవం, ఎండమావులు, పద్మవ్యూహం నాటికలూ ప్రధాన గ్రంథాలు. ఇవి కాక కొన్నివందల వ్యాసాలు, సమీక్షలు వ్రాశారు. విప్లవ రచయితల సంఘానికి కొంతకాలం కార్యదర్శి. అంతకు ముందు అభ్యుదయ రచయితల సంఘంలో ప్రముఖ సభ్యులు. నిశితమైన విమర్శాదృష్టి ఈయన వ్యక్తిత్వంలో ప్రముఖ అంశం కావడం వల్ల, రచనలో విప్లవ నిబద్ధతను గాఢంగా నమ్మడం వల్ల, కవిత్వం కూడా విమర్శాపరిపాకంతోనే వుంటుంది. విప్లవ రచయితల్లో విలక్షణ కంఠం ఈయనది.

## అజంతా (1929)

అసలు పేరు పెనుమర్తి విశ్వనాథశాస్త్రి. పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా కేశనకుర్రు గ్రామం. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేశారు. బి.కాం. పట్టభద్రులు. ఆంధ్రప్రభ దినపత్రికలో అసిస్టెంట్ ఎడిటర్‌గా ఉద్యోగం చేసి, పదవీ విరమణ చేశారు. అత్యాధునిక కవులలో శ్రీశ్రీ అంటే మిన్నంటే గౌరవం వున్నా –ఎవరి ప్రభావానికీ లోనుగాకుండా నిలచిన విలక్షణ సర్వస్వతంత్రుడీయన. అజంతా తనకు తనే ఒక ఏకాకి మానవోద్యమం. భాషలో, భావప్రకటనంలో, అత్యుత్తమశైలిని నిర్మించి, 'అనితర సాధ్యం నా మార్గం' అని ధాటిగా నిలబడ్డారు. కవిత్వంలో విద్యుత్తును ప్రవేశపెట్టగల ఆల్కెమీ ఏదో ఈయనకు తెలుసు. 'స్వప్నలిపి' ఒక్కటే వీరి కవిత్వ సర్వస్వం. మద్రాసు తెలుగు అకాడమీ అవార్డు (1988) – హైదరాబాద్ తెలుగు యూనివర్సిటీ అవార్డు (1996) – కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు (1997-98) – బి.ఎన్. రెడ్డి అవార్డు (1998) ప్రధాన పురస్కారాలు.

## గోపాల చక్రవర్తి (1931-1994)

అసలు పేరు నడిమింటి వేణుగోపాలశాస్త్రి. పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి. ఎం.ఎ. పట్టభద్రులు. 1953లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమాచార శాఖలో ఉద్యోగానికి ప్రవేశించి, 1981 నాటికి జాయింట్ డైరక్టరయ్యారు. 1983 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వికలాంగుల సంక్షేమ శాఖ ప్రారంభించగా దానికి డైరెక్టరుగా నియమితులయ్యారు. స్వభావం చేత హాస్యప్రియులు కావడం వల్ల వివిధ పత్రికల్లో ఎన్నో హాస్య, వ్యంగ్య శీర్షికలు నిర్వహించారు. చెవిలో జోరీగ, గోలాయణం, సల్లాపం, గోపాల భూపాలం వాటిలో కొన్ని. కలం కలలు, ఆనందం జీవనది ప్రధాన కవితా సంపుటాలు. పైకి హాస్య రచయితగా కనిపిస్తూనే, అంతరంగంలో జీవన వ్యథార్థ దృశ్యాలకు చలించిపోయే మనస్వి. ఈయన తన కొద్దిపాటి కవిత్వ వ్యాసంగంలో, వేదనామూలాలు వెదికే పనిచేశారు.

## సి . నారాయణరెడ్డి (1931)

పుట్టిన ఊరు కరీంనగర్ జిల్లా వేములవాడ మండలంలో హనుమాజీపేట. ఎం.ఎ. పట్టభద్రులు. ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయం , ప్రయోగాలు అనే అంశం మీద పరిశోధన చేసినందుకు ఉస్మానియా విశ్వవిద్యాలయం డాక్టరేటు ప్రదానం చేసింది. చాలా కాలం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవి, సార్వత్రిక విశ్వవిద్యాలయానికి , తెలుగు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్ష పదవులు నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా వున్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు. రాజ్యసభ సభ్యులు. విశ్వంభర, నాగార్జునసాగరం, కర్పూర వసంతరాయలు, మధ్యతరగతి మందహాసం, నడక నాతల్లి, ప్రపంచ పదులు, మాకందాలు, తెలుగుగజల్లు ప్రముఖ రచనలలో కొన్ని . నలభయేళ్లకు పైగా అవిశ్రాంతంగా రచనా వ్యాసంగమే ప్రవృత్తిగా వున్నారు. ఈయన శిరస్సు గేయ ధర్మంతో ఊగుతుంటే, పాదాలు వచన కవిత్వంలో నిలిచాయి. ప్రశస్తమైన వక్త. పరశ్శతంగా వచనకవితా ఖండికలు వ్రాశారు. సినిమా రంగంలో మనసు పెట్టి పాటలు వ్రాశారు. భారతీయ సాహిత్య పురస్కారాలలో అగ్రగణ్యమైన జ్ఞానపీఠ పురస్కార గ్రహీత. సోవియట్ లాండ్

నెహ్రూ అవార్డు, కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు, కుమారన్ ఆశాన్ అవార్డు ఈయన అందుకున్న అసంఖ్యాక పురస్కారాలలో కొన్ని మాత్రమే. తాననుకున్నది కవిత్వంగా చేయగల ఇంద్రజాలికుడీయన. ఎప్పుడూ ప్రజల మధ్య ఉండాలనే తపన ఈయన కవిత్వానికి ప్రేరణ.

## వెల్చేరు నారాయణరావు (1932)

పుట్టిన ఊరు శ్రీకాకుళం జిల్లా (?) ఎం.ఎ. పట్టభద్రులు. ఏలూరు సి.ఆర్. రెడ్డి కళాశాలలో కొంతకాలం అధ్యాపకుడిగా పనిచేశారు. అనంతరం అమెరికా లోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవి నిర్వహించారు. ప్రస్తుతం అదే విశ్వవిద్యాలయంలో సౌత్ ఏషియన్ స్టడీస్ విభాగం డైరెక్టర్. ప్రాక్ పశ్చిమ సాహిత్యాలతో గాఢ పరిచయం వుంది. ప్రశస్తమైన వక్త. విమర్శకులు. 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' అనే పరిశోధనకు ఆంధ్ర విశ్వవిద్యాలయం డాక్టరేటు ఇచ్చింది. నారాయణరావంటే పుష్కల తార్కిక ప్రజ్ఞ. సాహిత్య విషయాల వివేచనలో లోతైన భావుకులు. కవిత్వమంటూ స్థిరంగా వ్రాసినది తక్కువ. తన్ను తాను అర్థం చేసుకోవడానికి చేసిన ప్రయత్నమే ఆయన కవితా వ్యాసంగం. విమర్శకుడిగా ఎంత కరుకైన వాడో, కవిత్వం విషయంలో అంత మెత్తనివాడు. ముగ్ధుడు.

## శివసాగర్ (1932)

అసలు పేరు జి.కె. సత్యమూర్తి. మరోపేరు శివుడు. ఒకప్పుడు పీపుల్స్‌వార్ కేంద్ర కమిటీ కార్యదర్శి. విభేదాల వల్ల బయటికి వచ్చాక సామాజిక విప్లవవేదిక కన్వీనరు. ఉద్యమం, నెలబాలుడు, నెలవంక కవితా సంపుటులు ప్రధాన రచనలు. ఈయునది అరుదైన మనోధర్మం నిండిన కవిత్వం. విప్లవ కవిత్వమనగానే 'నినాదవినోదిని' అనే అభిప్రాయం ప్రచారంలో ఉండగా అద్భుత కాల్పనిక ఆవేశంతో ఆ ఉద్యమంలో విలక్షణంగా నిలచిన కవి. ఇంకొక మాటలో చెప్పాలంటే వేసవి కాలపు వెన్నెల వంటి కవి.

## సుబ్బారావు పాణిగ్రాహి (1932-1969)

పుట్టిన ఊరు శ్రీకాకుళం జిల్లాలో సోంపేట. అక్కడే ఎస్.ఎస్.ఎల్.సి వరకు చదివారు. 1948 తర్వాత బొడ్డపాడు గ్రామం వెళ్ళి, యువజన సంఘం పెట్టారు. కూలీలలో కూలీగా బతికారు. రాత్రి పాఠశాల నిర్వహించి అక్కడ పేద జనానికి అక్షరాస్యత కలిగించారు. సోషలిస్టు భావాలకు ఆకర్షితులై, కమ్యూనిస్టుగా పరిణమించి, ఆ సిద్ధాంత లక్ష్యాన్ని 'జముకుల కథ' ప్రక్రియ ద్వారా ప్రచారం చేయడానికుద్యమించారు. అచ్చమైన రాజకీయ కవిగా రూపొందారు. మరీ ముఖ్యంగా జీవించిన కాలంలో చివరి రెండేళ్ళు కావ్యగానం చేశారు. ఈయన మరణానంతరం, 'ఎరుపు' అనే ఆయన పాటల సంపుటిని 1972లో విప్లవ రచయితల సంఘం ప్రచురించింది. ఆయన కవిత్వ మార్గం క్రమంగా విప్లవ కవులకు వరవడి అయింది.

## వజీర్ రహ్మాన్ (1934-1980)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా కాకినాడ. ఎం.ఏ పట్టభద్రులు. 'ఎచటికి పోతావీ రాత్రి', 'సాహసి' కవిత్వ సంపుటాలు ప్రధాన రచనలు. బెంగాలీ, ఉర్దూ, హిందీ, ఆంగ్ల కవులపైన వ్యాసాలు వ్రాశారు. కొన్ని కవితలు తెలుగులోకి అనువాదం చేశారు కూడా. చలం రచనల నుంచి కొన్ని కవిత్వ వచన భాగాలను యేరి, 'కవిగా చలం' అనే పుస్తక రూపంలో సంకలనం చేశారు. 'చలాన్ని తాగి నిషాలో వున్నాను, ముట్టకు మెరుపై జ్వలిస్తాను, తట్టకు ఉరుమై ధ్వనిస్తాను' అని మనసంతా చలం మయం చేసుకున్నారు. ఈయన భావించే విధానంలో చలం ప్రభావం ప్రబలం. ప్రతి అనుభవానికీ తీవ్రంగా చలించే మనస్సు. ఊగించి, లాలించి, శాసించే స్త్రీ యీయన కవిత్వేతి వృత్తం.

## నగ్నముని (1940)

అసలు పేరు మానేపల్లి హృషీకేశవరావు. పుట్టిన ఊరు గుంటూరు జిల్లా తెనాలి. కృష్ణాజిల్లా బందరులో బి.ఎ. వరకు చదివారు. ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్

అసెంబ్లీలో సంయుక్త కార్యదర్శి హోదాలో ఉద్యోగ విరమణ చేశారు. ఉదయించని ఉదయాలు, తూర్పుగాలి, కవితా సంపుటాలు. కొయ్యగుర్రం, జమ్మిచెట్టు కావ్యాలు. నగ్నముని కథలు, నగ్నముని విలోమ కథలు ప్రధాన రచనలు. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' నవలను నాటకంగా మలిచారు. దిగంబర కవిత ప్రారంభకులు. విప్లవ రచయితల సంఘ వ్యవస్థాపకుల్లో ఒకరు. ప్రజాస్వామ్య కవిత ప్రారంభకులు. కత్తివాదర లాంటి నిర్దాక్షిణ్యమైన జీవన వాస్తవికతలను అంత కరుకుగా , నిర్దాక్షిణ్యంగా కవిత్వ రూపంలో ప్రకటించాలని ఈయన మతం. 'కవిత్వం దిగబరం కావా'లనడంలో, అది సర్వాలంకారాలను, సున్నితత్వాలను, పదాడంబరాలను వదిలించుకోవాలని ఉద్దేశం. ఈ దేశపు మధ్యతరగతి ప్రజల భగ్నస్వప్నాల ఆక్రోశాల రుతి, ఈయన కవిత్వ శ్రుతి.

## వరవరరావు (1940)

పెండ్యాల వరవరరావు పుట్టిన ఊరు వరంగల్ జిల్లా లోని చినపెండ్యాల. ఎం.ఎ. పట్టభద్రులు. 'తెలంగాణ విమోచనోద్యమం' గురించిన పరిశోధనకు డాక్టరేటు పొందారు. వరంగల్‌లో, కళాశాల అధ్యాపకులు. విప్లవ రచయితల సంఘంలో ప్రముఖ పాత్ర వహించారు. 'సృజన' సాహిత్య పత్రిక సంపాదకులు. విప్లవోద్యమ నిర్మాణంలో సాహిత్యపరంగా నిమగ్నతకు అంకితమైన వ్యక్తి. జీవనాడి, చలినెగళ్ళు, ఊరేగింపు, స్వేచ్ఛ, సముద్రం, భవిష్యత్తు చిత్రపటం, ముక్తకంఠం ప్రధాన కవిత్వ సంపుటాలు. కవిగా సామాజిక విప్లవ సందేశానికి అగ్రప్రాధాన్యమిచ్చారు. ఆలోచన అనుక్షణం విప్లవోన్ముఖంగా నడవాలని నమ్మారు. అలాగే వ్యాఖ్యానించారు. విశ్లేషించారు.

## వేగుంట మోహనప్రసాద్ (1942)

'మో' అనేది మరో పేరు. పుట్టిన ఊరు పశ్చిమగోదావరి జిల్లాలో వట్లూరు. ఇంగ్లీషు సారస్వతంలో ఎం.ఎ. పట్టభద్రులు. డి.టి.ఇ. డిప్లమో కూడా వుంది. విజయవాడ పి.బి. సిద్ధార్థ ఆర్ట్స్ కాలేజీలో అధ్యాపకత్వం వృత్తి. చితి – చింత,

బతికిన క్షణాలు, రహస్తంత్రి, పునరపి ప్రధాన రచనలు. 1969లో ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, 1994లో తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు ముఖ్య పురస్కారాలు. ఈయన అంతరంగంలో కవిత్వ చలనాలు చాలా సున్నితమైనవి. అందరికీ సామాన్యంగా కనిపించే దృశ్యాలను అనుభవాలను, అపురూప కవిత్వంగా మలచగల నేర్పరి. స్వతంత్రమైన ఒక అధివాస్తవికత కవిత్వ శైలిని నిర్మించుకున్నారు. కవిత్వానుభవంలో అంతర్ముఖుడు. జీవనదుఃఖం ఈయన ఇతివృత్తం.

## స్మైల్ (1942)

పూర్తి పేరు మహమ్మద్ ఇస్మాయిల్. పుట్టిన ఊరు కృష్ణాజిల్లా లోని తేలప్రోలు. ఎం.ఎ. పట్టభద్రులు. ప్రస్తుతం కమర్షియల్ టాక్సెస్ శాఖలో డిప్యూటీ కమిషనరుగా ఉద్యోగం. ఒఖడే కవితా సంపుటి, ఖాళీ సీసాలు (కథలు, కవితలు, అనువాదాలు, నాటకం కలిసిన) సంయుక్త సంపుటి ప్రధాన రచనలు. మానవ దాక్షిణ్యం ఈయన కవిత్వంలో అంతస్స్రవంతి. ఈ జీవితాన్ని ప్రేమించి, ఈ మనిషి వెధవ బాగుపడకపోతాడా! అని ఆశగా ఎదురుచూసే ఆర్తుడు.

## కె. శివారెడ్డి (1943)

పుట్టిన ఊరు గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలో కార్మూరువారిపాలెం. ఇంగ్లీషు సారస్వతంలో ఎం.ఎ. పట్టభద్రులు. 1967నుంచి ఆంగ్లోపన్యాసకులుగా వృత్తి ప్రారంభించారు. ప్రస్తుతం హైదరాబాద్ వి.వి. కాలేజీ ప్రిన్సిపాల్. రక్తం సూర్యుడు, చర్య, ఆసుపత్రి గీతం, నేత్ర ధనుస్సు, భారమితి, మోహనా! ఓ మోహనా !, అజేయం, నా కలల నది అంచున, ప్రధాన కవితా సంపుటాలు. ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ముఖ్య పురస్కారాలు. మనిషి పట్ల, అతడి భవిష్యత్తు పట్ల అపార ప్రేమ వున్న కవి. వెల్లడిగా పచ్చని ప్రకృతిమధ్య మసలుతూ మనిషి మనిషినీ పలకరించి క్షేమమడిగే సదాబాలకుడీ కవి. జీవితంలో అనుభవాలకీ ఆదర్శాలకీ ముడివెయ్యాలని ఈయన ఆర్తి.

## తల్లావఝ్ఝుల పతంజలి శాస్త్రి (1945)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లాలో పిఠాపురం. ఎం.ఎ. పట్టభద్రులు. పురావస్తు శాస్త్రంలో పి.హెచ్.డి. ఇరవై సంవత్సరాల పాటు అధ్యాపక వృత్తిలో వున్నారు. ప్రస్తుతం 'పర్యావరణ కేంద్రం ' స్వచ్ఛంద సేవాసంస్థ నిర్వాహకులు. (ప్రభుత్వేతర సంస్థ) 'గుండె గోదారి' కవిత్వ సంపుటి. పర్యావరణం గురించీ, సాహిత్యం గురించీ కొన్ని వ్యాసాలు ప్రధాన రచనలు. పర్యావరణం, సాహిత్యం, సామాజిక విశ్లేషణ, ఆదివాసి సంస్కృతి ఈయన జీవితంలో అంతర్భాగాలు. వీటి అధ్యయనం ద్వారా వర్తమాన సామాజిక రుగ్మతలకు మూలాలు వెతకాలని తాపత్రయం. నిశిత చింతనాశీలత ఈయన వ్యక్తిగత, సాహిత్య జీవితాలకు మూలధాతువు.

## కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ (1947)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా కోరుకొండ మండలంలో అచ్యుతాపురం. కాకినాడ ఇంజనీరింగ్ కళాశాల నుంచి ఎలెక్ట్రికల్ ఇంజనీరింగులో పట్టభద్రులు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విద్యుత్ సంస్థలో ఎడిషనల్ డివిజనల్ ఇంజనీరు. 'వెలుతురు పిట్టలు', అక్షరంలో అంతరిక్షం ప్రధాన కవిత్వ సంపుటులు. ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, గంగాధరం లిటరరీ అవార్డు ముఖ్య పురస్కారాలు. ఈయన కవిత్వ విషయంలో అంతర్ముఖుడు. సరికొత్త పదచిత్రాలతో, ఊహలతో, కవిత్వాన్ని అపురూప మనోవేదనా వేదికగా భావించే కవి. అందుకే, సైన్స్ కవితలను ఆవిష్కరించి ప్రయోగించ గలిగారు. ఆధునిక కవిత్వానికొక తాత్త్విక భూమిక అవసరమని భావిస్తారీయన.

## ఎన్. గోపి (1948)

పూర్తి పేరు ఎన్. గోపాల్. పుట్టిన ఊరు నల్లగొండ జిల్లా భువనగిరి. ఉస్మానియా విశవిద్యాలయంనుంచి ఎం.ఏ పట్టభద్రుడు. ప్రజాకవి వేమన అనే అంశంపై డాక్టరేట్ పొందారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్య

పదవిని నిర్వహిస్తున్నారు. తంగేడిపూలు, మైలురాయి, చిత్రదీపాలు - కవిత్వ సంపుటులు. వ్యాసనవమి, వ్యాససంపుటి - ప్రధాన రచనలు. ఈయన కవిత్వం సాదాసీదాగా కనిపిస్తూనే గుంపులో వంటరి బాధితుడ్ని పసికడుతుంది. దృశ్యాన్ని చిత్రించినా, పాత్రను వర్ణించినా, అంతరంగంలో వేదనా మూలాలను వెతకడానికి ప్రయత్నిస్తుంది.

## రేవతీదేవి (1951-1981)

పుట్టింది గుంటూరు జిల్లాలో. తత్త్వశాస్త్రంప్రధాన విషయంగా ఎం.ఎ. పట్టభద్రత. జె.పి.సార్త్రపై పరిశోధన ప్రారంభించి, ముగించకుండానే, జీవితం ముగించారు. 1979 ఒక్క సంవత్సరంలోనే, ఏదో ఆవహించినట్టుగా రాసిన కవితలు 'శిలాలోలిత' సంపుటిగా ప్రచురితమయ్యాయి -1981లో. రేవతీదేవి కవిత్వం చదివినా, ఈ పుస్తకానికి ఆమె వ్రాసిన మలిపలుకు చదివినా, కవిగా, వ్యక్తిగా ఆమె ఎంత స్వతంత్రురాలో అర్థమవుతుంది. సముద్రంలో మునిగి అపురూప జలగర్భ ప్రపంచాన్ని అన్వేషించే 'డైవర్' మాదిరిగా , ఆమె అనుభవ సముద్రాంతర్భాగాన్ని 'ఎక్స్‌ప్లోర్' చేయప్రయత్నించిన తాత్త్వికురాలు. మనిషి బద్ధలైపోయేటంతటి మహావేశం ఆమె కవిత్వ వాక్యాలుగా పరిణమించింది. ఏ అరమరికలు , నిషేధాలు లేకుండా స్త్రీ తన అనుభవాలను, తన సొంత కంఠంలోంచి వినిపించడం రేవతీదేవితోనే మొదలు.

## శిఖామణి (1956)

అసలు పేరు కె. సంజీవరావు. పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా యానాం (కేంద్రపాలిత ప్రాంతం)ఎం.ఎ. పట్టభద్రులు. 'ప్రయోగవాది పఠాభి' అనే అంశం మీద ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేటు పొందారు. ప్రస్తుతం హైదరాబాద్ లోని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో అసిస్టెంట్ ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు. మువ్వల చేతికర్ర, చిలక్కొయ్య కవిత్వ సంపుటులు, దళిత సాహిత్య తత్త్వం, వివిధ సాహిత్య వ్యాస సంపుటులు ప్రధాన రచనలు. ఫ్రీవెర్స్. ఫ్రంట్ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు , గరికపాటి సాహితీ

పురస్కారం, ఉమ్మడిశెట్టి పురస్కారం, బులుసు సీతారామశాస్త్రి స్మారక పురస్కారం పొందారు. 'అమ్మ' కవితా సంకలనానికీ, ఇంకా మరికొన్ని సాహిత్య గ్రంథాలకీ, సంపాదకత్వం వహించారు. ఈయన నిసర్గ కవి. నేలను చించుకొని పచ్చని మొక్క పుట్టినట్టు తన జీవనానుభవం నుంచి అప్రయత్నంగా పుట్టినట్టుంటాయి ఈయన కవితలు. ఈయన పట్టుకున్న జీవన రససూత్రం పువ్వులో దారంలాగా, తంబుర తీగలో శ్రుతి లాగ, మనకు తన ఉనికిని తెలియజేస్తూనే ఉంటుంది.

## జయప్రభ (1957)

పుట్టిన ఊరు నాగపూర్. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎ. పట్టభద్రత. 'భావకవిత్వంలో స్త్రీ' అనే పరిశోధనా వ్యాసానికి ఎమ్.ఫిల్. పట్టాన్ని, 'ఆధునిక తెలుగు నాటకము - ప్రభావాలు, ప్రయోగాలు' అనే అంశం మీద పి.హెచ్.డి. పట్టాన్ని పొందారు. (ఈ పరిశోధనా గ్రంథమే 'నాలుగో గోడ' పేరిట తరవాత పుస్తకంగా వెలువడింది) కొంతకాలం అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకురాలిగా పనిచేశారు. ప్రస్తుత నివాసం సికింద్రాబాద్. సూర్యనారాయణతో కలిసి ప్రచురించిన 'సూర్యుడు కూడా ఉదయిస్తాడు' కవిత్వ సంపుటి అటుండగా - యుద్ధోన్ముఖంగా' కవిత్వ సంపుటితో స్వతంత్ర ప్రచురణలు ప్రారంభం. వామనుడి మూడోపాదం, 'ఇక్కడ కురిసిన వర్షం ఎక్కడి మేఘానిదో', 'యశోధరా వగపెందుకే', 'చింతల నెమలి' ప్రధాన రచనలు. ఉండేల మాలకొండారెడ్డి సాహిత్య పురస్కారం, ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు ప్రధాన పురస్కారాలు. స్త్రీ వాద సాహిత్యంలో కవిత్వపరంగా స్వతంత్ర ధోరణి ఈమెతోనే ప్రారంభం. గాఢమైన అనుభవం, తేటైన వచన పద్యశిల్పం, బలమైన అభివ్యక్తి, ఈమె ప్రత్యేకతలు. హృదయంలో దీపం పెట్టి మంత్రనగరి సరిహద్దులు ముట్టడం ఈమె స్వభావ లక్షణం. తెలుగు కవిత్వంలో అరుదైన స్వతంత్ర కంఠం ఈమెది.

## కొండేపూడి నిర్మల (1957)

పుట్టిన ఊరు విజయవాడ. బి.ఎ. పట్టభద్రత. కొంతకాలం విజయవాడలో వనితాజ్యోతి' పత్రికలో ఉద్యోగం. తరవాత 'సుప్రభాతం' పత్రికలో పనిచేశారు.

ప్రస్తుత నివాసం హైదరాబాద్. 'సందిగ్ధ సంధ్య', 'నడిచేగాయాలు' కవిత్వ సంపుటులు, 'శత్రుస్పర్శ' కథాసంపుటి ప్రధాన రచనలు. కృష్ణశాస్త్రి అవార్డు, ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు ప్రధాన పురస్కారాలు. కవిగా స్త్రీవాదినుల్లో ప్రముఖులు. పురుషాధిక్య ప్రపంచం మీద తిరుగుబాటు కవిత్వ లక్ష్యం. ఆక్రోశం, ఆగ్రహం ఈమెకు కవిత్వ మూలపదార్థాలు.

## ఎండ్లూరి సుధాకర్ (1959)

పుట్టిన ఊరు నిజామాబాద్ పాములబస్తీ అయినా, రికార్డుల ప్రకారం హైదరాబాదు. ఎం.ఎ. పట్టభద్రులు. 'జాషువా సాహిత్యం - దృక్పథం - పరిణామం' అనే అంశంమీద పరిశోధనకు డాక్టరేటు పొందారు. ప్రస్తుతం పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయపు, రాజమండ్రి సాహిత్య పీఠంలో - బొమ్మూరులో - అసిస్టెంట్ ప్రొఫెసరుగా ఉద్యోగం చేస్తున్నారు. 'వర్తమానం' కవిత్వ సంపుటం, కొత్త గబ్బిలం' దళిత దీర్ఘ కవిత, ముఖ్య రచనలు. ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు, ఉదయభారతి నేషనల్ అవార్డు, గరికిపాటి సాహితీ పురస్కారం, తిలక్ అవార్డు, ముఖ్య పురస్కారాలు. ఆగ్రహాక్షరాలు ఆర్ద్రతా వాక్యాలు కావాలనేది ఈయన కవిత్వ సిద్ధాంతం. తానెరిగిన జీవితానుభవంలో కరిగి, కవిత్వంగా పరిణమించడం ఈయన మనోధర్మం.

## వాడ్రేవు చినవీరభద్రుడు (1962)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లాలో శరభవరం. తత్త్వశాస్త్రంలో ఎం.ఎ. పట్టభద్రులు. ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్‌మెంటు అధారిటీలో ప్రాజెక్టు అధికారిగా ఉద్యోగం. ప్రస్తుతం శ్రీశైలంలో నివాసం. నిర్వికల్పసంగీతం, అరణ్యాం, ప్రశ్నభూమి, ఒంటరిచేలమధ్య ఒక్కత్తే మన అమ్మ - ప్రధాన రచనా సంపుటాలు. 1989లో గంగాధరం సాహితీ పురస్కారం పొందారు. తాత్త్విక చింతన ఈయన కవిత్వంలో అంతస్సూత్రం. ప్రతి అనుభవాన్ని ఒకానొక అనుభవ భాషలోకి పరివర్తింపజేయడం చూస్తాం. వైయక్తిక అనుభవధారకి అగ్ర ప్రాధాన్యమిచ్చే కవి.

## యాకూబ్ (1962)

పుట్టిన ఊరు ఖమ్మం జిల్లా రొట్టమాకురేవు. ఎం.ఎ. పట్టభద్రులు. 'తెలుగు సాహిత్య విమర్శలో రా.రా. మార్గం' అనే అంశంతో రాచమల్లు రామచంద్రారెడ్డి విమర్శనారీతి గురించి పరిశోధన చేసి ఎం.ఫిల్ పొందారు. హైదరాబాద్‌లో కళాశాల అధ్యాపకత్వం వృత్తి. 'ప్రవహించే జ్ఞాపకం' కవితా సంపుటి ప్రధాన రచన. కవిత్వ రచనలో, సిద్ధాంతాల కంటె వైయక్తిక అనుభవాన్ని ప్రమాణంగా తీసుకునే యువ కవుల్లో ముఖ్యులు. ఒక అనుభవాల్ని, దృశ్యాన్ని, భావచిత్రంగా పరివర్తింపజేసి జీవితాన్ని వ్యాఖ్యానించడం ఇష్టం.

## త్రిపురనేని శ్రీనివాస్ (1963-1996)

పుట్టిన ఊరు చిత్తూరు జిల్లా తిరుపతి. డిగ్రీ చదువు. కొంతకాలం విప్లవోద్యమంలో పాల్గొని – అనంతరం విజయవాడలో ఉదయం దినపత్రికలో, ఆంధ్రజ్యోతి దినపత్రికలో సంపాదకవర్గంలో పనిచేశారు. 1996లో హైదరాబాద్‌లో ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులుగా పదవి చేపట్టిన కొద్దికాలంలోనే ఒక రోడ్డు ప్రమాదంలో మరణించారు. కవి సౌదాతో కలిసి ప్రచురించిన 'గోదావరి ప్రవహించు' కవిత్వ సంపుటి, తానుగా విడిగా ప్రచురించిన 'రహస్యోద్యమం' కవిత్వ సంపుటి, మరణానంతరం మిత్రులు సేకరించి ప్రచురించిన 'హో!' కవిత్వ సంపుటి ప్రధాన రచనలు. నిరంతరోత్సాహి. దళిత కవిత్వోద్యమానికి గట్టి చేయూత ఇచ్చాడు. ఆధునిక తెలుగు కవిత్వంలో రకరకాల ప్రయోగాలు చేయడానికి ప్రయత్నించాడు. జీవితపు అనుభవాలను తటస్థంగా గ్రహించి వ్యాఖ్యానించడం ఇష్టం. ఎక్కడా గతానుగతి కవిత్వం ఈయనకు రుచించదు.

## విమల (1963)

విప్లవ రచయితల సంఘం సభ్యురాలు. ప్రగతిశీల మహిళా సమాఖ్య (స్త్రీ విముక్తి) రాష్ట్ర ప్రధాన కార్యదర్శి. 'అడవి ఉప్పొంగిన రాత్రి' కవిత్వ సంపుటి

ప్రధాన రచన. ఆవేశ ప్రధానంగా కంటె, అంతర్గత తార్కికత, నిబద్ధత కారణంగా కవిత్వంలో నినదించడం ఈమె స్వభావంలో ఉంది. స్త్రీవాదినుల్లో వామపక్షం వైపు మొగ్గు చూపే కవి ఈమె.

## విన్నకోట రవిశంకర్ (1964)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా కాకినాడ. వరంగల్ రీజినల్ ఇంజనీరింగ్ కళాశాలలో చదివి ఎం.టెక్. పట్టభద్రత. కొంతకాలం హైదరాబాద్ విద్యుత్ సౌధాలో అసిస్టెంటు ఇంజనీరుగా పని చేసి, ప్రస్తుతం అమెరికాలోని కొలంబియాలో కంప్యూటర్ ఇంజనీరుగా ఉద్యోగం చేస్తున్నారు. 'కుండీలో మర్రిచెట్టు' కవిత్వ సంపుటి ప్రధాన రచన. ఈయన కవిత్వం, వ్యక్తిత్వం కూడా సౌమ్యమైనవి. క్లుప్తత, సరళకథనం, అనుభవ నిబద్ధత, కొత్త తరం కవులలో ఈయనను ఎన్నదగినవాడిగా నిలిపాయి. ఈ విషయాలలో ఈయన ఇస్మాయిల్ మార్గానుయాయి.

## సీతారాం (1964)

పుట్టిన ఊరు ఖమ్మం జిల్లాలో ఆరెంపుల. ఎం.ఎ. పట్టభద్రులు. తెలుగు సారస్వతం ప్రధాన విషయం. పి.హెచ్.డి. కూడా చేశారు. ప్రస్తుతం ఖమ్మంలో నివాసం. కళాశాలాధ్యాపకత్వం వృత్తి. అఫ్సర్, ప్రసేన్‌లతో కలిసి 'రక్తస్పర్శ' కవిత్వ సంపుటి ప్రచురించారు. 'ఇదిగో ఇక్కడి దాకే', సన్ ఆఫ్ మాణిక్యం' కవిత్వ సంపుటులు ప్రధాన రచనలు. ఆధునిక కవి 'ఎస్కటాలాజికల్ సర్వే' ఎందుకు చేయకూడదు? అనే ప్రశ్నతో బయలుదేరిన కవి. బాధల్ని తుడిచే 'డస్టర్' కోసం వెతుకులాట. వెతల మరకల్ని భాషపెట్టి తుడుచుకోవాలని ఆరాటపడే కవి. ఆర్థికమాంద్యాలొచ్చిపడే జీవితాలకు భాషామాంద్యం కూడా తోడుపడరాదని ఉద్దేశం. మృత్యుస్పర్శ ఈయన ఇతివృత్తం.

## అఫ్సర్ (1964)

పుట్టిన ఊరు ఖమ్మం జిల్లా చింతకాని. ఎం.ఎ. పట్టభద్రులు. 'ఆధునిక కవిత్వం - వస్తువు - రూప పరిణామం' అనే అంశం మీద పరిశోధన చేసి డాక్టరేటు పొందారు. ఆంధ్రభూమి దినపత్రికలో ఛీఫ్ సబ్-ఎడిటర్‌గా ప్రస్తుతం ఉద్యోగం చేస్తున్నారు. 'ఇవాళ' కవితా సంపుటి, 'ఆధునికత - అత్యాధునికత' సాహిత్య వ్యాస సంపుటి ప్రధాన రచనలు. 'అక్షరాలా...' అనే పేరిట ఆంధ్రభూమి దినపత్రికలో ఒక సాహిత్య శీర్షిక నిర్వహించారు. ఫ్రీవెర్స్ ఫ్రంట్ అవార్డు, ఉమ్మడిశెట్టి సాహితీ పురస్కారం ముఖ్యపురస్కారాలు. విప్లవ రచనోద్యమానంతర కాలంలో --1980 దశకంలో - స్వతంత్ర రచనామార్గం అనుసరించిన కవి. ఆధునిక వచనకవిత్వంలో రూపపరమైన 'పరిశుభ్రత' సాధించారు. జీవనానుభవాన్ని భావచిత్రాల ద్వారా, తాత్త్విక విశ్లేషణ ద్వారా, సరళంగా చెపుతారు. భావ వ్యక్తీకరణలో అవసరమైతే సంక్లిష్టతను కూడా ఒక అలంకారంగా గ్రహిస్తారు.

సంకలనం ఏర్చి కూర్చిన

## ఇంద్రగంటి శ్రీకాంతశర్మ (1944)

పుట్టిన ఊరు తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురం. పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంనుంచి భాషాప్రవీణులు. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎం.ఏ పట్టభద్రులు. ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక ఉపసంపాదకులుగా వృత్తి ప్రారంభించి విజయవాడ, నిజామాబాద్ ఆకాశవాణి కేంద్రాలలో రచయితగా కార్యక్రమం నిర్వహణాధికారిగా, పనిచేసి (1976-95) ప్రస్తుతం ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికకు సంపాదక పదవిలో ఉన్నారు. 'శిలామురళి' గేయకథా కావ్యం, 'అనుభూతిగీతాలు' కవిత్వ సంపుటి, 'పొగడపూలు' గీత సంపుటి, 'తూర్పున వాలిన సూర్యుడు' నవల, సాహిత్య పరిచయం, ఆలోచన, అలనాటి నాటకాలు, సంచలనమ్, తెలుగు కవుల అపరాధాలు మొదలైన సాహిత్య విమర్శ ప్రధాన రచనలు. ఆకాశవాణిలో తన సంగీత సృజనాత్మకత నాటక డాక్యుమెంటరీ రచనలకు 14 వార్షిక పురస్కారాలు అందుకున్నారు. కవిగా అనుభూతివాది. *